12.4.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:15 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

మేరేజ్ సీజన్ సందర్భంగా సూటింగ్స్, షర్టింగ్స్, సఫారి లేటెస్ట్ రకములు వచ్చియున్నవి

విమల్ జంక్షన్

కాపువీధి పోన్: 25420 నెల్లూరు

కుమార్ షర్టులు వచ్చియున్నవి

# అత్తా అల్లుళ్ల ఆగమే సందడంతా!

రాష్ట్రంలో పార్లమెంట్ ఎన్నికల సందడి ముమ్మరంగా వుంది. ప్రచారం ఉధృత మౌతూంది. నాయకులు, అభ్యర్థులు, కార్యకర్తలు అందరూ వూరూరు తిరిగి ఓట్ల భిక్ష అడగడంలో నిమగ్నులై వున్నారు. వూరేగింపులు, ప్రదర్శనలు, చైతన్య రథయాత్రలు, మైకుల గోల వగైరా వగైరాలతో రాష్ట్రమంతటా కలకలంగా వుంది. శేషన్ పుణ్యమా అని జెండాలు, బ్యానర్ల న్యూసెన్స్ లేదు. జెండాలు కడితే వాటి ఖర్చు చూపించ డమెట్లో అర్థం కాని అవస్థ ఒకటైతే; ఆ జెండాలు కరెంట్ స్తంభానికో, టెలిఫోన్ స్తంభానికో కట్టారు కాబట్టి అధికార దుర్వి నియోగమని శేషన్ చెవి మెలేస్తాడన్న భయం మరొకటి! అందువల్ల వూళ్లలో ఎన్నికల కళ కన్పడడం లేదు. గోడల మీద రాతలు రాసినా శేషన్ చూస్తాడన్న జంకు వుండడంతో మహా మహా కుబేరులైన అభ్యర్థులు కూడా పళ్లు దగ్గర పెట్టుకొని ప్రవర్తిస్తున్నారు. ఎన్నికల కార్యాలయాలు కూడా లేవు. కార్యకర్తలకు అసలు పని లేదు.

తెలుగు దేశం చీలకుండా వుండి వుంటె ఈ మాత్రం కలకలం కూడా వుండి వుండేది కాదు. అత్తా, అల్లుళ్లు వీధికెక్కి వీరంగాలాడు తుండడంతో ఉద్రిక్త వాతావరణం ఏర్పడు తున్నది. చంద్రబాబు, లక్ష్మిపార్వతి లిద్దరూ ఇప్పటికే సగం రాష్ట్రం చుట్ట బెట్టేశారు. ఈమె రథంలో రోడ్డు పైన, ఆయన హెలికాప్టర్‌లో ఆకాశం నుంచి క్రిందకు వాలి తిట్ల పురాణంతో వూదర గొట్టేస్తున్నారు. ఇంకొక ప్రక్క చంద్రబాబుకు పల్లవిగా హరికృష్ణ; లక్ష్మిపార్వతికి తాళం వేస్తూ వెంకటేశ్వర రావు డప్పు వాయిద్యాలు వాయిస్తున్నారు. ఎన్టీఆర్‌ను నువ్వు చంపావంటే, కాదు నువ్వే చంపావని; ఎన్టీఆర్ వారసత్వం మాదంటే కాదు మాదేనని వాదు లాడుకోవడం తప్ప వీరి ఉపన్యాసాలలో వాసిలే వుండడం లేదు. ఎన్ని సభలు జరిగినా సారాంశం ఒకటే!

## కాంగ్రెస్ మన్ను దిన్న పాము వలె పడివుంది!

కాంగ్రెస్ పార్టీ పరిస్థితి నిస్తేజంగా వుంది; మన్నుదిన్న పాము వలె పడి వుంది. ఇంతటి దీన స్థితిలో ఈ పార్టీ ఇది వరకెప్పుడూ ఏ ఎన్నికా చేసి వుండదు. ఎన్నికలకు ఇక రెండంటే రెండు వారాల వ్యవధి మాత్రమే వున్నా, ఇప్పటికీ కాంగ్రెస్ పార్టీ తరపున ఒక్క సభ కూడా జరగలేదు. ఇక ముందు జరిగే అవకాశమూ కన్పడడం లేదు; ఏ నాయకుడూ రాష్ట్రంలో పర్యటించడం లేదు; ఏ అభ్యర్థికా అభ్యర్థి తన జీపు, తన జెండా, తన కార్యకర్తలతో తంటాలు పడడం తప్ప వ్యవస్థాపరంగా వారికి పార్టీ నుంచి ఎటువంటి అండ, ఆదరణ లభించడం లేదు. రాష్ట్ర స్థాయిలో పార్టీని వుత్తేజ పర్చగల నాయకుడు ఒక్కడూ లేకపోవడమే దీనికి కారణం. ప్రధాన మంత్రి సైతం తన నంద్యాల, తన కుమారుడి సికింద్రాబాద్‌లు మాత్రమే వెళ్లి, వీధి నాయకులతో మాట్లాడి విమాన మెక్కేశారు. దేశ ప్రధానిగా ఒక తెలుగు వాడున్నప్పటికీ, తెలుగుల రాజధాని నగరంలో బహిరంగ సభ నిర్వహించనూ చేతకాని అశక్తు రాలై పోయింది కాంగ్రెస్ పార్టీ. రాష్ట్ర నాయకులలో కోట్ల విజయ భాస్కర రెడ్డి, డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి తమ తమ నియోజక వర్గాలకే పరిమితమై పోయారు; అక్కడ వారు ఓటమి చక్ర బంధనంలో ఇరుక్కొని, బయట పడను తనక లాడుతున్నారు. నేదురుమల్లి జనార్దన రెడ్డి నెల్లూరు, తిరుపతులలో గిరి గీసుకొని తిరుగు తున్నారు. జలగం రిటైర్ మెంట్ ఖాయమై పోయింది; ఆయనలో ఇంకా ఓపికనేది మిగిలి వుంటే ఖమ్మంలో కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించడానికి సరి పోతున్నది. పిసిసి అధ్యక్షుడు రోశయ్య ఖాళీయే కాని, ఎవరూ ఆయన్ను పిలవడం లేదు. సిఎల్పి నాయకుడు పి. జనార్దన రెడ్డికి హైదరాబాద్ దాటి వచ్చే స్థాయి లేదు. ఇంకెవ్వరు మిగిలి వున్నారు - కాంగ్రెస్‌లో?

విచిత్ర మెక్కడంటే, కాంగ్రెస్ నాయకులు ఇళ్లలో విశ్రాంతి తీసు కొంటున్నా, కాంగ్రెస్ పవనాలు జవాన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఉభయ

కొరవ 7 పేజీలో

Phones: 23538 - 26648

NELLORE CENTRAL SCHOOL

Rohini Nagar (Muthukur Road) - NELLORE - 524 003.

[AFFILIATED TO CENTRAL BOARD OF SECONDARY EDUCATION, NEW DELHI]

ADMISSION NOTIFICATION



FOR THE ACADAMIC YEAR 1996 - 97
APPLICATIONS FOR ADMISSION INTO
JKG, SKG AND I TO VIII CLASSES
WILL BE ISSUED FROM 15.4.96

DIRECT ADMISSION FOR JKG, KG CLASSES WILL BE HANDLED BY EXPERIENCED ANGLO - INDIAN TEACHERS

FOR FULL PARTICULARS CONTACT NCS OFFICE AT ROHINI NAGAR BETWEEN 9.00 A.M. AND 11.30 A.M.

HOSTEL FACILITY

COMPUTER EDUCATION

BUS FACILITY

SEPARATE VAN FACILITY FOR KG CLASS STUDENTS

K.S. RAO
CORRESPONDENT

# నెల్లూరులో ఓటరు అంత గుంభనంగా వున్నాడేమిటి?

నెల్లూరు పార్లమెంట్ సీటులో ప్రచారం ఎంత ముందు కొడిగా వుందో ఓటరు మనో భావాలూ అంతే గుంభనంగా వున్నాయి. ఎన్నికల పట్లనే జనంలో నిరాసక్తత ఏర్పడడం దీనికి కారణమైతే కావచ్చు కాని, ఓటరు తాను దేనికోసం ఓటేయ బోతున్నదీ ఏ మాత్రం బయట పడడం లేదు. ఎవర్ని కదిలించి చూసినా నిర్లిప్తత. నిర్లక్ష్య భావాలు వ్యక్త మౌతున్నాయి. ఈ ఎన్నికను సగటు ఓటరు సీరియస్‌గా తీసు కోవడం లేదు; ఎటువంటి ఆసక్తి ప్రదర్శించడం లేదు. ప్రచారం మరింత ముమ్మరమై, ఉద్రిక్త వాతావరణం ఏర్పడితే పరిస్థితిలో ఏదైనా మార్పు వస్తుందేమో చూడాలి.

ప్రచారం విషయంలో కాంగ్రెస్, సిపిఎం అభ్యర్థు లిద్దరూ పోటా పోటీగా వున్నారు. కాంగ్రెస్ లక్ష్మికి ప్రారంభ కష్టాలు తీరాయి. నామినేషన్ ముందు రోజు మాత్రమే ఆమె పేరు వెలికి రావడంతో కాంగ్రెస్ వాదులెవరూ వెంటనే ఆ షాక్ తట్టుకోలేక పోయారు. అందువల్లే ఆమె పట్ల వ్యతిరేకా భిప్రాయాలు వ్యక్తమైనాయి. ఈ జిల్లాకు చెందినామె కాదని, ఎక్కడి నుంచో తెచ్చి దించారని, ఆమెవరో ఎవరికీ తెలియదని, ఆమె ఒక వర్గానికి పరిమిత మౌతుందని, ఆమె లావుగా వుందని, పొట్టిగా వుందని... రకరకాల మాటలు మాట్లాడారు. నాలుగు రోజులు గడిచే సరికి అవన్నీ సర్దుక పోయాయి. శ్రీమతి లక్ష్మి చాలా చతురురాలు వలె వుంది. రాజకీయాలకు కొత్త అయినా ఏ మాత్రం తడబాటు, తత్తరపాటు లేకుండా నిమ్మళంగా, నేర్పుగా కాంగ్రెస్ నాయకులను, కార్యకర్తలను కూడా మంచి చేసేసు కున్నారామె. ఒకసారి ఆమెతో మాట్లాడిన వారు అసంతృప్తి అన్నిటిని ప్రక్కన పెట్టేసి, ప్రచారం ప్రారంభించేస్తున్నారు.

శ్రీ జనార్దన రెడ్డి వరుసగా నాలుగు రోజులు నెల్లూరులో కూర్చొని నియోజక వర్గమంతా ఒకసారి ప్రచారం మొదలయ్యేందుకు ఏర్పాట్లు చేసి వెళ్ళారు. అన్ని అసెంబ్లీ నియోజక వర్గాలలో కాంగ్రెస్ ప్రచార రథం పయన మారంభమైంది. కాంగ్రెస్ స్పెషాలిటీ అదే. ఒక నిర్ణయానికి రావడమంటూ జరిగితే - స్విచ్ ఆన్ చేస్తే మిషన్ తిరిగినట్లు, ఎన్నికల యంత్రాంగం రెడీ అయి పోతుంది.

సిపిఎం అభ్యర్థి శ్రీ టిపి భానురాజా కూడా ప్రచారం విషయంలో వ్యవస్థీ కృతంగా వ్యవహ రిస్తున్నారు. వారిది నిబద్ధత కల్గిన పార్టీ; కార్యకర్తలకు కొరవ లేదు. ఒక పద్ధతి ప్రకారం, ప్రణాళిక ననుసరించి వూరూరు తిరిగేస్తున్నారు భానురాజా. ప్రతి చోటా దేశం ఎమ్మెల్యేలు వుండడంతో ఆయన పని సుఖంగా వుంది. అందులోనూ అధికార పార్టీ; ఇద్దరు మంత్రులు ప్రచారంలో నిమగ్నమై వున్నారు.

లక్ష్మీపార్వతి అభ్యర్థి సునీల్ కుమార్ పరిస్థితే పాపం జాలి పడాల్సి నట్లుంది. వల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి, రావుల అంకయ్య గౌడ్ లిద్దరు తప్ప ఆయన్ను మోసే వారెవరూ లేరు. కనీసం పూర్లకు దారి చూపించే వారూ లేరు. 10 [illegible] ప్రచారం చేసుకోలేక పోవడం జాలి గొల్పే పరిస్థితి కదా? లక్ష్మీపార్వతి వచ్చి బహిరంగ సభలలో మాట్లాడితే పరిస్థితిలో ఏదైనా మార్పు వస్తుందేమో చూడాలి.

ప్రచారం సంగతి సరే - విజయావ కాశాలు ఎట్లున్నాయి? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ఇంకా రెండు వారాల వ్యవధి వుంది. అంత తొందర పడవలసిన అవసరం లేదు. కాని నాలుగైదు శాతం ఓటర్లు తప్ప, తక్కిన వారు ప్రచారం, ఎన్నికల యంత్రాంగంతో నిమిత్తం లేకుండా తమ నిర్ణయం తాము తీసు కొంటారన్నది వాస్తవం. ఆ దృష్టితో చూసినప్పుడు ఇప్పటికి ఓటరులో ఒక అభిప్రాయం ఏర్పడి పోయి వుండాలి. అది ఏమై వుంటుం దన్నది కని పెట్టడమే అలివి కావడం లేదు.

> ◎ కాంగ్రెస్ లక్ష్మికి ప్రారంభ కష్టాలు సమసిపోయాయి!
> ◎ సిపిఎం భానురాజుకు దేశం ఎమ్మెల్యేల తూట్లు?
> ◎ దేశం సునీల్‌కు పాపం ఓటడిగే వారే లేరు!

తెలుగు దేశంలో ఏ పార్టీ పట్ల జనం మోజు చూపు తున్నారన్న సంగతి పొర లాగ గల్గితే విషయం తేలిపోతుంది. నామినేషన్ల సమయం నాటికి జనం మూడ్ చూస్తే లక్ష్మీపార్వతి పట్లనే మొగ్గు వుంటుం దన్పించింది. గ్రామాలలో ఈ మోజు మరీ స్పష్టంగా వుండింది. రామారావు గారి రాజకీయ వారసురాలిగా ఆమెనే భావిస్తుండినారు. అప్పటికి, ఇప్పటికి ఈ వైఖరిలో మార్పు వుంటుం [illegible] అయితే ఆ పార్టీ ఓట్లున్నా వాటిని అడిగి వేయించుకొనే వారు లేరు. ఆమె పార్టీకి యంత్రాంగ మంటూ ఏదీ లేక పోవడం పెద్ద లోపం. గూడూరు, కోవూరులలో; కొద్దిగా రాపూరులో తప్ప సునీల్ కుమార్‌ను పట్టించు కొనేవారు లేరు. ప్రచారంలో అంతగా వెనుక బడిపోవడం వల్ల, జనంలో ఏదైనా మార్పు వస్తుందా?

సిపిఎం భానురాజా విజయా వకాశం చంద్రబాబు తెలుగు దేశం ఓట్లను ఆకర్షించే పరిణామం పై ఆధార పడి వుంటుంది. ఇటీవల ఇచ్చిన రేషన్ కార్డులు, సబ్సిడీ బియ్యం పథకం కొనసాగింపు చంద్రబాబు పట్ల జనంలో కొంత సానుభూతి కల్పిస్తున్నాయి. వీటిని ఓట్లుగా మార్చు కోవడంలో భానురాజా వాకచక్యం వ్యక్తం కావాలి. అయితే ఆయనకు తెలుగు దేశం ఎమ్మెల్యేలు తూట్లు పొడుస్తున్నారన్న [illegible] లందుతున్నాయి. సర్వేపల్లి, నెల్లూరు, ఆత్మకూరులలో ఈ కోత పడి పోతుంటే, తక్కిన చోట్ల ఎమ్మెల్యేలు అర్థ మనస్సుతో, అంటీ ముట్టనట్లు వ్యవహ రిస్తున్నారన్నది నిజం.

నెల్లూరులో రమేష్ రెడ్డికి ఇటీవల బాలాజీ నగర్‌లో జరిగిన శ్రీమతి ఉషారాణి ఉదంతం సాకు దొరికింది. సిపిఎం తనను కావాలని రోత పట్టించిందని, అందువల్ల వారి గెలుపుకు తాను పని చేయ వలసిన అగత్యం లేదని చెప్తున్నారట. అందువల్లే ఆయన నెల్లూరులో ప్రచారం చేస్తున్నట్లు ఫోటోలు తీయించుకొని, పత్రికల కిచ్చేసి; కోవూరులో కాలం గడుపు తున్నారు. ఆయన అనుచరులూ అంతే! ఆత్మకూరు లక్ష్మయ్య నాయుడు గారికి, గత జిప ఎన్నికల్లో తన అభ్యర్థిని సిపిఎం ఓడించిందన్న కినుక వుంది. ఆయన అనుచరులు బహిరంగంగానే కాంగ్రెస్ పక్షం వహిస్తున్నారని వార్త లందుతున్నాయి. చంద్ర మోహన్ రెడ్డికి భానురాజా పట్ల సదభిప్రాయం లేదు. గూడూరులో పార్టీని ఎన్నికలకు సమాయత్తం చేసే నైపుణ్యం మంత్రి దుర్గా ప్రసాద్‌కు అబ్బడం లేదు. నల్లపరెడ్డిను మైనస్ చేస్తే ఆయనక్కడ రాజకీయంగా జీరో క్రిందే లెక్క. రాపూరులో ఎల్లసిరికి శ్రద్ధ లేదు. నెల్లూరు, కోవూరు, అల్లూరులలో తమ పార్టీకున్న ఓట్లను గట్టి పరుచు కోవడంలో మాత్రమే ఇప్పటి వరకు భానురాజా సఫలీ కృతుడై వున్నాడు. తెలుగు దేశం ఓట్లు ఆయనకు పడాలంటే ఇప్పుడు పడుతున్న కష్టం చాలదు.

ఉభయ తెలుగు దేశంలోని ఈ లోపాలు కాంగ్రెస్ లక్ష్మిని గట్టెక్కిం చేట్లున్నాయి. ఒక్క మాగుంట కుటుంబీకులు తప్ప, ప్రతి కాంగ్రెస్ వాదీ మనస్ఫూర్తిగా సహకరించడం ఆమె అదృష్టం. గత శాసన సభ ఎన్నికల్లో ఓటమి వల్ల కొనక్కిపోయి వున్న మాజీ ఎమ్మెల్యేలంతా తమ తమ స్థానాల్లో తమ ప్రతాపం నిరూపించుకోను స్వచ్ఛందంగా తంటాలు పడుతున్నారు. అభ్యర్థి కోసం వారు చూడడం లేదు. తమ స్వంత ఎన్నికగానే పోరాడు తున్నారు. అల్లూరు విష్ణు అయితే జేబుకు చిల్లి పెట్టుకొని మరీ పని చే[illegible]ట.

తరువాయి 8 పేజీలో


M మాడరన్ కంటి వైద్యశాల

16/184, కె.వి. అగ్రహారం, (బ్యాంక్ ఆఫ్ ఇండియా వెనుక వైపు) ట్రంకురోడ్డు, నెల్లూరు. ఫోన్ : 24868

నేత్ర చికిత్సలో మరో ముందడుగు

నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలలోనే

ప్రప్రథమం మరియు అత్యాధునికమైన యాగ్ లేజర్ ప్రారంభోత్సవం

ప్రారంభకులు
గౌ॥ డా॥ రామకృష్ణన్, M.S.,
అరవింద్ ఐ హాస్పిటల్, మదురై

ముఖ్య అతిథి
గౌ॥ శ్రీ కె.వి. రత్నం
డైరెక్టర్, రత్నం కోచింగ్ సెంటర్, నెల్లూరు


NEODYMIUM : YAG OPHTHALMIC LASER
(LASEREX : AUSTRALIA)

మా ప్రత్యేకతలు
- కంప్యూటర్‌తో కంటి పరీక్ష
- ఆఫ్తాల్మిక్ లేజర్
- ఆఫ్తాల్మిక్ స్కాన్
- మెల్లకంటికి ఆపరేషన్లు
- చిన్నపిల్లల కంటి జబ్బులకు చికిత్స మరియు ఆపరేషన్లు
- అధునాతన పరికరములతో శుక్లములను తొలగించి కంటిలో అద్దములు అమర్చుట (Intraocular Lens Implantation)
- దృష్టిలోపములకు నల్లగుడ్డుపై అద్దములు అమర్చుట (Contact Lens)
- ఆక్యులార్ ఫిజియో థెరపి సెంటర్


డా॥ పి. ఎల్. రావు
M.S., F.P.S.M., (మదురై)

14.4.96 సా. 5.30 గం. జరుగు
ప్రారంభోత్సవమునకు విచ్చేయ వలసినదిగా
సహడాక్టర్లకు, మిత్రులకు,
శ్రేయోభిలాషులకు మా హృదయ పూర్వక
ప్రత్యేక ఆహ్వానం


డా॥ పి. భారతి,
M.B.B.S., DO., (మదురై)

BR Ads-Nlr-Ph : 24851

# సంకీర్ణమైతే సర్వనాశనమే!

కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడాలని, ఏర్పడి తీరుతుందని ప్రతిపక్ష నేతలు చేస్తున్న ప్రచారం అత్యంత ఆందోళన కల్గించే అంశం. ఏ ఒక్క పార్టీకి ఎన్నికలలో మెజారిటీ రాని పరిస్థితులు ఏర్పడితే రాజకీయ మరుగుజ్జులమైన తమబోటి వారికి మహామాత్యులుగా భోగ మనుభవించే భాగ్యం సిద్ధిస్తుందని వీరి ఆశ; అందుకే అటువంటి ప్రేలాపనలు.

సంకీర్ణ ప్రభుత్వాలు మనకు కొత్తకాదు; 1977 లో ఒకసారి, 1989లో మరొకసారి జనతా పార్టీ ప్రయోగం జరిగింది. రెండు పార్లు రెండేళ్లకు మించి అధికారంలో నిలువ లేక పోయారు వారు. 1977లో వచ్చిన పెద్ద మెజారిటీ కూడా నిరుపయోగమై పోయింది. భావ సారూప్యత లేకుండా, కేవలం పదవీ కాంక్షతో, వ్యక్తిగత లాభం కోసం భిన్న దృక్పథాలు, ఆలోచనా ధోరణులు కల్గిన వారు ఏకమైతే, ఆ ప్రభుత్వం చిరు ప్రకంపనలకే పేక మేడ వలె కూలి పోతుందని మొరార్జీ, చరణ్ సింగ్, వివిసింగ్, చంద్ర శేఖర్ ప్రభుత్వాలు నాలుగూ నిరూపించాయి. ఇప్పుడు మరొకసారి అటువంటి ప్రయత్నం చేయడం, అనేక పడటం దేశహితం కోరే వారు చేయదగిన పని కాదు.

దేశ రాజకీయాలలో ఏ పార్టీ కూడా దేశమంతటి ప్రజానీకపు ఆదరణ పొందలేని దౌర్భాగ్యపు స్థితిలో వుండడమే ఈ ఆలోచనలకు ఆస్కారం. కాంగ్రెస్, బిజెపిలు మినహా మరే పార్టీ కూడా స్వయంగా ప్రభుత్వాన్ని ఏర్పర్చ డానికి తగిన సీట్ల సంఖ్యలో పోటీ చేయడం లేదు. జనతా దళ్, సమాజ్ వాది పార్టీ, సమతా పార్టీ, సిపిఎం, సిపిఐ, తెలుగు దేశం, డిఎంకె, అస్సాం గణ పరిషత్, రిపబ్లికన్ పార్టీ, బిఎస్పి, ఎఐఎడిఎంకె వంటి పార్టీలు ఇంచు మించు రెండు డజన్ల వరకు ఎన్నికల్లో పోటీలో వున్నాయి. ఇవి చాలక మూపనార్, మాధవ రావు సింధియా వంటి వారు స్వంత కుంపట్లు వెలిగించుకొని వున్నారు. దేశ మంతటికీ సంబంధించిన విషయాల పై, విశాల దృక్పథంతో, జాతీయ భావ ప్రేరణతో, జరగ వలసిన పార్లమెంట్ ఎన్నికలు పంచాయితీ సమితి ఎన్నికల స్థాయికి దిగజారి పోయాయి. ఎక్కడి కక్కడ ప్రాంతీయ తత్వంతో, వ్యక్తిగత పలుకుబడి ఆధారంగా, పది మంది ఓటర్లను ప్రభావితం చేయగల్గిన ప్రతి వారూ ఒక హీరోగా వెలిగి పోతూ రాజకీయ వాతావరణాన్ని కలుషితం చేస్తున్నారు. కాంగ్రెస్‌కు ధీటుగా, ప్రత్యామ్నాయంగా లౌకిక, ప్రజాస్వామిక భావాలు, ఫెడరల్ రాజ్యాంగ నిబద్ధత కల్గిన రాజకీయ పక్షమేదీ రూపొందక పోవడం ఒక దౌర్భాగ్యమైతే; వామ పక్షాలు సైతం ప్రాంతీయ పరిధులకు కుంచించుక పోయి ఏదో ఒక ప్రాంతీయ పార్టీ తోకంటి పెట్టుకొని బ్రతకడం తప్ప, స్వతంత్రంగా జనాకర్షణ చేయలేని వామనావ తారం ధరించడం ఈ దేశాన్ని పట్టి పీడిస్తున్న ప్రారబ్ధం. అందువల్లే సంకీర్ణ ప్రభుత్వం వంటి తుచ్ఛమైన సంకల్పాలు కల్గుతున్నాయి.

విడివిడిగా తమకు ఎన్నికల్లో గెల్చే బలం లేనప్పుడు తమందరి శక్తి యుక్తులనూ సమష్టిగా కేంద్రీకరించి ఒక పార్టీగా ఏకీకృతమై, విధాన పరంగా భావైక్యత సాధించి ఎన్నికల్లో పోటీ చేసి వుంటే బాగుండేది. కానీ ఇప్పుడది జరగడం లేదు. కనీసం ఒక ఫ్రంట్‌గా కాంగ్రెస్, బిజెపిలను ప్రతిఘటించే పాటి ఐక్యత సైతం వీలు కాలేదు. ఎవరి పార్టీని వారు, ఎవరి అహంకారాన్ని వారు పరి రక్షించు కోవాలనే తాపత్రయంలో వున్నప్పుడు, ఒకే ప్రభుత్వం నడపడం ఎట్లా సాధ్యం? గుర్రం జూలు ఒకరు, తోక ఒకరు పట్టుకొని అదలించి నట్లుండదా అది? ప్రభుత్వాన్ని ఏ పద్ధతిలో నడపాలో, ఏ విధానం ప్రకటించాలో, ఏ శాసనం చేయాలో ఏ నిర్ణయం తీసుకోవాలో తెలియక నిత్యం కలహాలతో, కీచులాటలతో ఈ రాజకీయ పార్టీలు దేశాన్ని అధోగతి పాల్జేసే ప్రమాదం వుంది. దేశం ఇప్పుడున్న పరిస్థితిలో అటువంటి సంకీర్ణ ప్రయోగం చేస్తే దానివల్ల తటస్థించే అనర్థాలు ఊహాకందవు. ఆర్థిక, వాణిజ్య, విదేశీ సంబంధిత, రక్షణావసరాలకు సంబంధించి స్పష్టమైన, స్థిరమైన నిర్ణయాలు తీసు కోలేకుంటే అరాజకం, అలజడి, అల్లకల్లోల పరిస్థితులు నెలకొంటాయి. పివి ప్రవేశ పెట్టిన సంస్కరణల ద్వారా ఇప్పుడిప్పుడే గాడిన పడుతున్న ఆర్థిక రథం మళ్లీ గతుకుల బాటలోకి జారిపోయి, బోల్తా పడుతుంది.

జమీన్‌రైతు

ప్రతి ఓటరూ సంయమనంతో ఆలోచించ వలసిన సమయమిది. కేంద్రంలో ఏ కొంచెం అస్థిరత ఏర్పడినా అది ఓటు వేసిన వాడి మెడకు శాపమై చుట్టు కొంటుంది. తాత్కాలిక భావోద్రేకాలకు, ఆకర్షణలకు భ్రమసి తెలుగు దేశం వంటి చిల్లర మల్లర పార్టీలకు ఓటు చేస్తే దేశ భవితవ్యాన్ని చేజేతులా నాశనం చేసిన వారౌతారు. శాసన సభ, పంచాయితీ ఎన్నికలలో ప్రాంతీయ పార్టీలను ఆదరించడం తప్పు కాదు; ఫెడరల్ రాజ్యాంగ విధానానికి అది తగువైన రాజకీయ నిర్ణయం కూడా! అయితే కేంద్ర ప్రభుత్వం విషయంలో ఏ రాష్ట్ర ప్రజలు ఆ రాష్ట్రంలో సినిమా మోజుకో, సబ్సిడీ బియ్యం కృతజ్ఞతకో ఓట్లను త్యాగం చేస్తే అది జాతి విపత్తుగా పరిణమిస్తుంది. కేంద్రంలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడితే జరిగేది సర్వ నాశనమే. వారెటూ రెండేళ్లకు మించి పరిపాలించ లేరు; ఆ రెండేళ్లలోనూ రెండు డజన్ల సార్లైనా మంత్రిత్వాలు మారి పోతాయి. కొత్తగా మరొక ఇద్దరు ముగ్గురు మాజీ ప్రధానులను, ఒక వంద మంది మాజీ కేంద్ర మంత్రులను సృష్టించ డానికి తప్ప ఇంకెందుకూ కొరగాని సంకీర్ణ ప్రభుత్వం సృష్టికి ఓటరు సంకల్పించ కూడదు. ఓటు వేసే ముందు ఆలోచించి తీర వలసిన విషయమిది!

---

## జమీన్‌రైతు

12.4.1946
సం: 0-1-6 సంచిక:8

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### పల్లెటూళ్లు

**సీతారాంపురం**

గాంధీ అనుచర సేవా సంఘం, చేనేత కాంగ్రెస్ సంఘాలు ఏర్పడ్డాయి మార్చి 14 తేదిన.

**మనుబోలు**

కమ్యూనిస్టు హెడ్మాస్టర్ గారి గ్రామ ఐక్యతా విచ్ఛిన్న చర్యలకు బడి పిల్లలు మార్చి 21 నుండి సమ్మె చేస్తున్నారు. జిల్లా బోర్డు యింకా కదలటం లేదు. గ్రామ ఐక్యత భగ్నం గావాలనే కోరికా?

**పొదలకూరు**

రాపూరు తాలూకా కాంగ్రెస్ వారు జిల్లా శాసన సభ్యులకు సన్మానం జరుప తీర్మానించారు. రాష్ట్ర కాంగ్రెస్ సంఘమునకు బి. పెంచల్ సర్వారెడ్డిని పంపాలని సలహా యిచ్చారు.

### వెంకటగిరి ఎస్టేటు చెర్వుల దుస్థితి

పిడూరు చెర్వు రిపేరు 3 వేల నుండి రు 500 లకు తగ్గించుట.

జమీందారీలు రద్దు అవుతవి అనే కారణంతో మరీ పరిపాలన దుస్థితి ఏర్పడి పోతున్నది.

లక్షలాది మూల్గుతున్నా దమ్మిడీ గూడా ఖర్చు పెట్టి జలాధారాలు బాగు చేయడం లేదు.

పిడూరు బంగారు చెరువు జలాధారాల్లో చాలా శ్రేష్ఠమైంది. చెరువుకు పారుదల వసతి చాలా ముఖ్యమైంది. గ్రామ బేరిజు 15 వేలు వుంటుంది. దీని రిపేరుకు యిది వరకు మూడు వేలు వేశారు. కాని చేయించిన పాపాన పోలేదు. ఇప్పుడు మళ్ళీ ఆ యెస్టిమేటు తుంగల్లో దొక్కి రు. 500 లకు మాత్రం చేస్తారట. ఇది చాలా అన్యాయం.

చెరువు రిపేరు లేనందున పూర్తిగా సాగై ఫలింపు గావలసిన పైర్లు వృధా అయి పోయినవి. అధికాహారం సంగతుంచి, అసలాహారమే కుంటు బడిపోతుంది.

ఆహార ప్రశ్న సరి జెయ్యాలంటే ముందు జమీందారీల్లో జలాధారాలు, అందునా నీటి అవకాశం వుండి కూడా జమీందారుల ఉదాశీనంతో చెడిపోతుండే జలాధారాలు బాగు చేయవలెను. అట్టి ముఖ్య జలాధారమగు పిడూరు బంగారు చెరువుకు అధమం 3 వేలైనా ఖర్చు పెట్టి రిపేరు చేయు టవసరము.

### నెల్లూరు ముచ్చట్లు

**హరిజన ప్రవేశం**

పొట్టి శ్రీరాములు గారి త్యాగ దీక్షా ఫలితంగా వేణు గోపాల స్వామి దేవాలయ ట్రస్టీలు 3 తేది సమావేశమై హరిజన ప్రవేశమునకు ప్రభుత్వ అనుమతి కోర వలసినట్లు తీర్మానించిరి.

కొరవ 8వ పేజీలో

---

# ఎన్నికల్లో పోటీకి ఒక పరిమితి విధించాలి!

## జనవాణి

కొందరు నాయకులు తాము బ్రతికి నంత కాలం ఒకే స్థానం నుంచి ఎమ్పీలుగా, ఎమ్మెల్యేలుగా కొనసాగుతున్నారు. ఎప్పుడూ ఒకరే నాయకులుగా కొన సాగడం వల్ల ప్రజాస్వామ్య లక్ష్యం నెరవేరడం లేదు. అందువల్ల రాజ్యాంగంలో మార్పులు తేవాలి. ఒక వ్యక్తి రెండు సార్లకు మించి ఎమ్మెల్యేకాని, ఎమ్పీ కాని కారాదనే నిబంధన విధించాలి. దీనివల్ల యువతరం నుంచి జవాబుదారి నాయకత్వం పుట్టు కొస్తుంది. అధ్యక్ష పాలన మన దేశానికి పనికి రాదు కాబట్టి నవతరం రాజకీయాల్లోకి రాను ఈ పద్ధతిని అనుసరిస్తే బాగుంటుంది. దురదృష్టవ శాత్తు దేశంలో ప్రధాన పక్షాలైన కాంగ్రెస్, బిజెపి, సిపిఎం, సిపిఐ నాయకులంతా 60 ఏళ్లకు పై బడిన వారే. వీరి ఆలోచనలు బాగుండవచ్చు. ఆచరణలోకి తేవడంలో విఫల మవుతున్నారు.

-ఈపూరు వెంకురెడ్డి
గుడ్లూరువారిపాలెం

### అభ్యర్థుల ఎంపికకు కొలబద్ధ ఏమిటి?

కాంగ్రెస్ అభ్యర్థుల ఎంపిక ఒక ఫార్సుగా సాగింది. డిసిసి, పిసిసి జాబితా లంటూ ఏదేదో హంగామా సృష్టించారు. కార్యకర్తలు, ఓట్లు తెచ్చే వారి సలహా సంప్రదింపులు తీసుకోలేదు. ఎఐసిసి స్టీరింగు కమిటీ కూర్చొని, కంప్యూటర్ లిస్టు అంటూ ఒక కొత్త లిస్టు సృష్టించింది. పలువురు ముక్కు ముఖం తెలియని వ్యక్తులను, మంత్రుల బంధువులను ఆ కమిటీ రంగంలోకి దించింది. ఈ సర్కసు చేయడానికి క్రింద నుండి జాబితా పంప మనడం అనవసరం. పార్టీ అధినేతకు ప్రజాకర్షణ లేనప్పుడు కార్యకర్తల ఇష్టానుసారం అభ్యర్థులను ఎంపిక చేస్తే కష్టపడి ఓట్లు తెస్తారు. అధిష్టాన వర్గాలకు ఈ విషయాలు ఎప్పుడు బోధ పడతాయి?.

నెల్లూరు -కె. విజయకుమార్

### విద్యుత్‌శాఖ నిర్లక్ష్యం

పప్పులవీధి పార్కు నుండి శివాజీ నగర్ వెళ్లే రోడ్డులోని మొదటి విద్యుత్ స్తంభం వాలిపోయి వుంది. ఏ క్షణంలోనైనా ఈ స్తంభం పడిపోయేట్లుంది. దీనివల్ల ప్రమాదం జరిగి తీరుతుంది. ఈ విషయాన్ని విద్యుత్ శాఖ అధికారు లందరి దృష్టికి తీసుక వెళ్లినా ఫలితం లేకుండా పోయింది. ప్రభుత్వ శాఖల్లో ఇంత ఉదాసీనత పనికి రాదు. కొత్త సిఐ గారికి ఈ విషయం చిన్నది కావచ్చు; కాని జరుగ రానిది ఏదైనా జరిగితే ఆయన బాధ్యత వహించక తప్పదు.

నెల్లూరు -ఎవిఎస్ సమీర

### రిజర్వేషన్లు ఎంత వరకు సాగుతాయి?

స్వాతంత్ర్యం వచ్చాక రాజ్యాంగం హరిజనులు, గిరిజనులకు కొన్ని ప్రత్యేక హక్కులు కల్పించింది. దాని ప్రకారం దేశంలోని కొన్ని పార్లమెంటరీ,

కొరవ 8 పేజీలో

నాణ్యతకు సాటి లేరు - రుచికి పోలికే వుండదు!
కమ్మటి సుగంధ ద్రవ్యాల సువాసనలతో ఘుమఘుమ లాడే
నిర్మల డీలక్స్ వక్కపొడి
సరకు ఉన్నంత వరకు పాత ధరలకే యివ్వబడును.
డీలక్స్ వక్కపొడి ఇప్పుడు 20 పైసలతో తయారవుతున్నది.

# మాగుంట ఇంట్లో కాంగ్రెస్ కాళ్ళ క్రింద నిప్పులకుంపటి!

మాగుంట సుబ్బరామ రెడ్డి గారు గతించిన తర్వాత రాజకీయంగా మౌనంగా వుంటూ వుండిన మాగుంట వర్గీయులు పార్లమెంట్ ఎన్నికల సందర్భంలో తమ వర్గ ఆధిపత్య ఆకాంక్షలు వెలికి తెస్తున్నారు. సుబ్బరామ రెడ్డి గారు లేరు కాబట్టి, వారి రాజకీయం ఒంగోలుకు మాత్రమే పరిమిత మౌతుందని భావించా రందరూ! కానీ అప్పుడా పరిస్థితి లేదు. వారి వ్యాపార సామ్రాజ్యాన్ని ఒంటి చేత్తో చక్కబెట్టే శ్రీ పివి ప్రసన్న రెడ్డి వారి వర్గ అస్తిత్వ పరిరక్షణ బాధ్యతనూ స్వీకరించి నట్టున్నారు. ఆ ఆకాంక్షలు, ఆ రక్షణ బాధ్యతలు ప్రదర్శించే అవకాశం కల్పించింది - పార్లమెంట్ ఎన్నిక.

కాంగ్రెస్ అభ్యర్థి శ్రీమతి పనబాక లక్ష్మికి మద్దతు ఇవ్వాలా, వద్దా అన్న విషయమై వారు చాలా తర్జన భర్జనలు పడ్డారు. ఆమె జనార్దన రెడ్డి ప్రతిపాదించిన అభ్యర్థి కావడంతో ఈ సమస్య ఉత్పన్నమై నట్టుంది. ఒంగోలులో శ్రీమతి పార్వతమ్మ విజయం ఖాయం కాబట్టి, జిల్లాలో ఇంక ఎవర్ని చూసీ భయపడ నవసరం లేదని, తమనెవ్వరూ ఏమీ చేయలేరని, అందువల్ల నెల్లూరులో స్వేచ్ఛగా నిర్ణయం తీసు కోవచ్చునన్నది వారి తలంపు. అయితే శ్రీమతి లక్ష్మి వారి వద్దకు వెళ్లి, ఉద్యుంపట్టు పట్టి, పాకం వేసి కూర్చోవడంతో - మొన్న 8 తేది సమాలోచనా సమావేశం జరిపారు. కళ్యాణి ఫిలింస్ ఆఫీసులో జరిగిన ఈ సమావేశం - కాంగ్రెస్ కాళ్ల క్రింద నిప్పుల కుంపటి వెల్గించింది.

సభలో మాట్లాడిన వారంతా శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి పైన, శ్రీ ఆనం సంజీవ రెడ్డి పైన విరుచుక పడ్డారు; తిట్ల

**జనార్దనరెడ్డి, సంజీవ రెడ్డిలపై విరుచుకొని పడ్డారు!**

పంచాంగం చదివారు. డిసిసి అధ్యక్షుడుగా ఆనం సంజీవ రెడ్డిని తొలగిస్తే తప్ప, నెల్లూరులో కాంగ్రెస్ పార్టీకి సహాయం చేయబోమనే శపథం ప్రకటించారు. గెండేళ నాటి ఇందిరా భవన్ సంఘటనలు ఇంకా కలహాలు త్రవ్వి పోశారు. ఆదిమూర్తి, బూదాటి రాఘయ్య వంటి వారు ఆ సభలో వాడిన భాష వినడానికి అసహ్యంగా వుండింది. ఈ అవకాశాన్ని తీసుకొని తమ మనసులలోని కక్షను వెళ్లగక్కిన వారు కొందరైతే; తామెంత మెప్పించ గల్గితే, అంతగా తమ జేబు నింపుతారనే ఆశతో ఇంకొందరు వేదిక పైన నోరు పారేసు కున్నారు.

అభ్యర్థిని శ్రీమతి లక్ష్మి జనార్దన రెడ్డి క్యాండిడేట్ కాబట్టి, ఆమె గెలుపుకు సహకరించే ప్రశ్నే లేదని మొదట అందరూ ఏకాభి ప్రాయం వ్యక్తం చేశారట. కాని తర్వాత మెత్తబడి, ఆమె గనుక -తాను "ఒక వర్గానికి కట్టుబడి వుండను, మాగుంట వారి మాట కూడా వింటాను" అని చేతిలో చెయ్యేసి బాస చేస్తే తమ నిర్ణయం మార్చుకొని కాంగ్రెస్‌కు తోడ్పడ తామని చెప్పారట; ఎన్నికలు కాగానే సంజీవ రెడ్డి గారిని డిసిసి అధ్యక్షత నుంచి తప్పించా లన్నది రెండవ షరతు. మొదటి షరతుకు - లక్ష్మికి అభ్యంతరం లేదు - ప్రమాణం చేసేశారామె; రెండవ షరతుకు ఎవరు హామీ ఇవ్వాలి? అదింకా పెండింగ్‌లోనే వుంది.

పివి ప్రసన్న రెడ్డి గారు మాత్రం - తమ వర్గంలోని వారంతా తమ తమ స్వంత నిర్ణయాలు తీసుకొని, కాంగ్రెస్‌కు పని చేయాలో, వద్దో తేల్చుకోవాలని; తాము మాత్రం ఎవర్నీ గెలవంత పెట్టబోమని ప్రకటించారు. అంతరాత్మ ప్రబోధం ప్రకారం నడుచుకో

కొరవ 8 పేజీలో

## సణుగుడు

- ఎన్నికల బరిలో ఇద్దరు నెల్లూరు ప్రముఖులు
- రమేష్‌రెడ్డి రోత పట్టి పోతున్నాడు

ఈ లోకసభ ఎన్నికల్లో నెల్లూరు జిల్లాకు చెందిన ఇద్దరు ప్రముఖులు నెల్లూరు వెలుపల తమ అదృష్టాన్ని పరీక్షించు కొంటున్నారు. బిజెపి జాతీయ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. వెంకయ్య నాయుడు హైదరాబాదులో ముస్లిం నాయకుడు సలావుద్దీన్ ఒవైసిని సవాల్ చేస్తుంటే; వితరణ శీలి శ్రీ టిక్కవరపు సుబ్బరామ రెడ్డి విశాఖ పట్టణంలో విజయ నగరం మాజీ రాజా ఆనంద గజపతి రాజును గడగడ వణికిస్తున్నాడు.

సుబ్బరామ రెడ్డి గారు నెల్లూరీయుడైనా, విశాఖ పట్టణంతో ఆయనకు మమేకం జాస్తి. స్టీలు ఫ్యాక్టరీ కాంట్రాక్టర్‌గా ఆ నగరంలో పాదం మోపిన ఆయన, ఆ నగర వాసులకు అత్యంత ప్రీతి పాత్రుడైన నాయకుడుగా ప్రజాభిమానం సంపాదించు కొన్నాడు. ఒక వూరిలో పుట్టి, ఇంకొక వూరిలో స్థిరపడి, వేరొక వూరిలో జన హితుడుగా గుర్తింపు పొంద గల్గడం ఆషామాషీ వ్యవహారం కాదు. సుబ్బరామ రెడ్డి గారి వ్యక్తిత్వ వైశిష్ట్యం అది.

ఆయనది నిజంగానే విలక్షణ వ్యక్తిత్వం. తన సంతోషాన్ని, సంపదను నలుగురితో పంచు కోవాలని తపన పడే అరుదైన సంస్కారం ఆయనలో చూస్తాం! కేవలం [illegible] లెక్క బెడితే, టిక్కవరపు సుబ్బరామ రెడ్డి గారి కంటే అధిక పరిమాణంలో కట్టలు సమ కూర్చుకొని, పెట్టెలు పెట్టెల కొద్దీ తంటాలు పడే కుబేరులు జిల్లాలో చాలా మంది వున్నారు. కానీ వారెవరికీ లేని గుర్తింపు, గౌరవం, కీర్తి, ప్రతిష్ఠ ఆయనకు వున్నాయంటే అందుకు [illegible] ఆ వ్యక్తిత్వ విలక్షణతే!

హైదరాబాదు నగరంలో ఆయన నుంచి చందా స్వీకరించని సేవా సంస్థ, కళా కేంద్రం వుండ వనడం అతిశయోక్తి కాదు. ఎన్ని సంస్థలకో ఆయన మహారాజ పోషకుడు. విశాఖ పట్టణంలో ఆయన విరాళాలు కోట్లలో వుంటాయి. కొన్ని వందల గ్రామాలలో దేవాలయాలు కట్టించాడు; కొన్ని వేల మందికి ఉపాధి చూపించాడు; ఆడిటోరియం కట్టించాడు; ఆడంబర

కొరవ 7 పేజీలో

# ఉత్తరక్రియలు

మా తండ్రి, నేత్రదాత

## ఆకు వెంకట రమణయ్య

**1.4.96**తేది మమ్ము దుఃఖసాగరమున ముంచి నీవు దివిగేగారు.
మీ ఆదరణ, అభిమానం, ఆప్యాయత మరువలేము మీ ఆత్మకు చిరశాం
తిని కలుగజేయమని భగవంతుని ప్రార్థించడం తప్ప మరేమీ చేయలేని

కుమారులు - కోడళ్లు
ఆకు ఆదిశేషయ్య - వెంకట సుబ్బమ్మ
ఆకు సుబ్బారావు - అమ్మణ్ణి
ఆకు పుండరీకాక్షం - పుష్పలత

మనుమళ్లు - మనుమరాళ్లు
వెంకట శేషయ్య - వెంకట లక్ష్మీలత
వెంకట బాలకృష్ణ - రజని
వెంకట సుజాత, వెంకట సుగుణ
వెంకట శేషశాయి, లీలామోహన్, సరస్వతి
మునిమనుమలు: రవితేజ, సాయి కుమార్

**ఉత్తరక్రియలు**

15.4.96 సోమవారం శిలోద్యాపన
16.4.96 మంగళవారం సపిండీకరణం (పొత్తర్లు)
17.4.96 బుధవారం వైకుంఠ సమారాధన
నెల్లూరు, బాలాజీనగర్, వాసవీనగర్‌లోని
మా స్వగృహమున జరుగును

# ఒంగోలు ఎవరికీ నల్లేరు పై బండి కాదు!

## గుత్తా మరీ బలహీనుడై పోవడంతో ఓటు ఓటుకూ విలువకట్టే క్లిష్ట పరిస్థితి!

నెల్లూరు జిల్లాలోని మూడు నియోజక వర్గాలలో ఒక్క ఒంగోలులోనే నిజమైన ఎన్నికల వాతావరణం కన్పిస్తున్నది. సందడిలో, పలుకుబడిలో, అనుచర గణంలో, జనాల మానంలో వస్త్ర వాహనాది వసతుల కల్పనలో, వ్యక్తిగత ప్రతిష్టలో సమ ఉజ్జీలైన మాగుంట పార్వతమ్మ, మేకపాటి రాజమోహన రెడ్డిలు పరస్పరం ఢీ కొంటుండంతో నియోజక వర్గమంతా ఎన్నికల సందడి తాండవిస్తున్నది. తేవన్ భయం వుండబట్టి కాని, లేకుంటే ఈ పాటికి వూరూరా, వాడవాడా జెండాలు, బ్యానర్లు, మైకుల రొద, వాహనాల దుమ్ముతో దద్దరిల్లి పోయి వుండేవి.

ఒంగోలులో నామినేషన్ల సమయానికి అసలు పోటీ వుండదు, వుండినా నామకార్థం అనుకున్నారందరూ! మాగుంట సుబ్బరామ రెడ్డి గారి విషాద మరణం, తత్ఫలితంగా జనంలో పెల్లుబికిన సానుభూతి ఉప్పెన, దానికితోడు సుబ్బరామ రెడ్డి గారు ఎమ్పీగా అక్కడ జనానికి చేసిన మంచి పనులు కలగలిసి అక్కడ మాగుంట కుటుంబం పేరుతో చీపుర పుల్లను నిలబెట్టినా గెల్చుకొని వచ్చేస్తుందన్న భ్రమ వుండింది. కానీ రాజకీయాలలో ఎప్పుడేమి జరుగు తుందో ఎవరూహించ గలరూ?

మేకపాటి రాజమోహన రెడ్డి నామినేషన్‌తో ఆ ఏకాభిప్రాయ, సర్వామకూల వాతావరణం గాలికి కొట్టుక పోయింది. హోరా హోరీ పోరు ప్రారంభమైంది.

లక్ష్మీపార్వతి తెలుగు దేశపు అభ్యర్థి గుత్తా వెంకట సుబ్బయ్య కూడా రంగంలో వున్నప్పటికీ, ఒంగోలులో ఈ వార్త వ్రాసే సమయానికి రాజ మోహన రెడ్డి, మాగుంట పార్వతమ్మల మధ్యే పోటీ పరిమితమై వుంది. ఇది అనూహిత పరిణామం. రాష్ట్రమంతా లక్ష్మీ పార్వతి గాలి తోల్తున్నది కాబట్టి, ఇక్కడా ఆమె అభ్యర్థి గట్టి ప్రతిఘటన ఇస్తారని భావించారు. రాజమోహన రెడ్డి, ఆయన చెరి సమంగా తెలుగు దేశం ఓట్లు చీల్చుకొని కాంగ్రెస్ పని సుకరం చేస్తారని అంచనా వేశారు. కానీ, అది తారు మారైంది. ఎందువల్లనో తెలియదు కానీ, గుత్తా వెంకట సుబ్బయ్య మరీ బలహీనుడై పోయాడు. కనీసం బిజెపి అభ్యర్థి స్థాయిలో కూడా ఆయన ప్రచారం నిర్వహించలేక పోతున్నారు. జిల్లా పరిషత్ ఛైర్మన్ వంటి ఉన్నత పదవి నిర్వహించిన వాడైనప్పటికీ గ్రామాలలో ఆయన అపరిచితుడుగా మిగలడం విచిత్రం. నెల్లూరు జిల్లాలోని ఉదయగిరి, కావలి విషయంలో గుత్తా పేరు, ప్రస్తావన విన్పించడం లేదు.

ఈ పరిణామాన్ని రాజ మోహన రెడ్డి చాలా చక్కగా వినియోగించు కొంటున్నారు. ఒంగోలు వరకు తెలుగు దేశమంటే తమదేనన్న అభిప్రాయాన్ని ఓటర్లలో కల్పించడానికి పథకాలు రచిస్తున్నారు. కులపరమైన రాజకీయాలకు పెట్టింది పేరైన ఒంగోలులో కమ్మ ఓటర్ల నాకర్షించ గల్గితే ఎన్నికల ఫలితం పై దాని ప్రభావం విస్తారంగా వుంటుంది. ఈ పాటికే ఆయన పాకనాటి రెడ్లను ఏకం చేయడంలో సఫలీ కృతుడైనాడని వార్త. కావలి పడమర పల్లెలు; ఉదయగిరి, కనిగిరి ప్రాంతాలలో పాకనాటి రెడ్ల ప్రాబల్యం జాస్తి. మరొక ప్రక్క కొండప నాయుడితో సంధి కుదిరిందని చెప్తున్నారు. ఇదే నిజమైతే కమ్మ ఓట్లను ప్రభావితం చేస్తుంది. కావలి టౌన్‌లో నారాయణ వంటి లక్ష్మిపార్వతి వర్గ నాయకులు పట్టీ పట్టనట్లు వ్యవహరిస్తున్నారు.

చావో, బ్రతుకో తేల్చుకోవాలన్న పంతం కన్పిస్తున్నది - రాజమోహన రెడ్డిలో! కాంగ్రెస్‌లో ఆరేళ్ల నుంచి టిక్కెట్ల పరంగా తన కెదురైన పరాభవం, మాగుంట హత్య విషయంలో రాజకీయ కుత్సితంతో తన పై జరిపిన దుష్ప్రచారం ఆయనలో ఆ పంతం పెంచాయి. ఈ ఎన్నికల్లో గెలిస్తే తప్ప తనకు రాజకీయ భవిష్యత్తు వుండదన్నది ఆయన అభిప్రాయం. అందువల్లే అంత ఉధృతంగా పోరు సల్పుతున్నారు.

ఉదయగిరి, కనిగిరి అసెంబ్లీ నియోజక వర్గాల పరిధిలో ఇప్పటికే ఆయన కంఫర్టబుల్ పొజిషన్ సాధించాడని చెప్తున్నారు. కావలి టౌన్‌లో కాంగ్రెస్‌కు వచ్చే మెజారిటీని, పడమటి పల్లెల్లో తన ఆధిక్యత ద్వారా సమం చేయగల్గితే గెలుపు సాధ్యమేనన్న ధీమా కన్పిస్తున్నది. అందువల్లే వేణుగోపాల రెడ్డిని ఒప్పించి, వళ్లు వంచి పని చేయిస్తున్నారు. అయితే ఒంగోలు, కందుకూరు, సంతనూతల పాడు, కొండపి నియోజక వర్గాలలో రాజమోహన రెడ్డి ఇంకా చెప్పుకో దగిన పట్టు సాధించ లేదు.

ఈ ప్రాంతంలో మాగుంట పార్వతమ్మ గ్లామర్ విస్తృతంగా వుంది. సుబ్బరామ రెడ్డి గారు చేసి వెళ్లిన మంచి పనులను, వాటి వల్ల వారి కుటుంబం జనంలో సంపాదించుకొన్న అభిమానాన్ని సద్వినియోగం చేసుకో గల్గితే ఓట్లు వాటంతటవి వచ్చి, రాసి పడతాయన్నది ఆమె ధీమా. ఆమె ప్రచారం చాలా పకడ్బందీగా జరుగుతూంది. వూరూరు వెళ్లడం, టాప్‌లేని జీపు పై నిలబడి, క్లుప్తంగా తన భర్త గురించి చెప్పడం, ఆయన్ను చంపిన దుర్మార్గుల రాజకీయపు టాశలు నెరవేర కూడదనుకున్నా, ఆయన ఆశయాలు నెరవేరాలన్నా తనను గెల్పించండని విజ్ఞప్తి చేయడం ఆమె ప్రచార తీరుగా వుంది. గ్రామాలలోకి వెళ్లినప్పుడు ఆమెను జనం సాదరంగా ఆహ్వానిస్తున్నారు; పనీ పాటా మానుకొని పరుగెత్తుకొచ్చి, ఎదురేగు తున్నారు. మహిళలలో సానుభూతి మరీ ఎక్కువగా వుంది. సుబ్బరామ రెడ్డి గారు వందలాది గ్రామాలలో చేసిన మంచి నీటి సరఫరా ఈ ఎన్నికలలో పార్వతమ్మ గారికి వర ప్రసాదిత మౌతున్నది.

అయితే జనంలో వున్న ఈ సానుభూతి నంతటినీ తమ కనుకూలంగా మల్చుకో గల్గిన యంత్రాంగం వారికి వుందా అన్నదే ప్రశ్న. మాగుంట కుటుంబీకుల పట్ల జనంలో వున్న గ్లామర్‌కు ప్రధాన కారణం వారి ధన సంపద. అందులోనూ సుబ్బరామ రెడ్డి గారు ఒంగోలు వాసులకు ఆ రుచి బాగా మరిపారు. కానీ ఇప్పుడంత జోరుగా పెట్టెల మూత తెరిపిన వరక పోవడంతో ఆయన్ను కనిపెట్టుకొని వుండిన వారిలో నిరాశ కల్గుతున్నది.

ఇంకొక ప్రక్క గత అసెంబ్లీ ఎన్నికలలో ఒంగోలు స్థానంలో కాంగ్రెస్ టిక్కెట్ తెచ్చుకున్న యాదవ్‌ను ఓడించడానికి సుబ్బరామ రెడ్డి గారు స్వతంత్ర అభ్యర్థిని రంగంలోకి దింపారన్న కినుక ఆ వర్గంలో వుంది. ఆ వ్యతిరేకతను సానుకూల పరచు కోవడంలో వారిప్పటికీ సఫలీ కృతులు కాలేదు.

మాజీ ఎమ్మెల్యేలు, మండల గ్రామ స్థాయి నాయకులను "మంచి" చేసు కోవడంలోనూ నిరాసక్తత ప్రదర్శిస్తుండడం వల్ల కాంగ్రెస్ ఎన్నికల యంత్రాంగం నత్తనడక నడుస్తూంది. ఒంగోలు బాలయ్య, కనిగిరి మహీధర్ రెడ్డి, కొండపి అచ్యుత్‌లు ఇప్పటికీ మనస్ఫూర్తిగా ప్రచారం ప్రారంభించ లేదని వార్త. కందుకూరు తిరుపతి నాయుడు, ఉదయగిరి జానకి రాంలు మాత్రం కంకణం ధరించి వున్నారు. కాని జానకి రాం వుండీ లేనట్లే లెక్క. గ్రామాల్లోకి వెళ్లి, స్వతంత్రంగా ఓటర్లను కలిసే పరిస్థితి ఆయనకు లేదు. నెల్లూరు నుంచి మునిసిపల్ కౌన్సిలర్లు, శ్రీ పివి ప్రసన్న రెడ్డిలను పిలిపించి, వారి వెంట పూళ్లలోకి వెళ్తున్నా డాయన. ఇంతటి భీకర పోరులో యోధులు కావాలి గానీ; కిరాయి సైనికులు, గైడ్‌లతో ఏమి జరుగుతుంది?

యోధత్వం కల్గిన యానాది రెడ్డి పార్వతమ్మను ఏడ్పిం చేస్తున్నారు. మాగుంట కుటుంబీకులు అడిగినా, అడగకున్నా తన నియోజక వర్గ పరిధిలో కాంగ్రెస్‌కు మెజారిటీ తెచ్చి తీర్తాడు యానాది రెడ్డి. ఆయనది కాంగ్రెస్‌కు వ్యతిరేకం చేసే నైజం కాదు.. ఆయనతో వచ్చిన చిక్కల్లా నియంతృత్వ పోకడ. తన రాజ్యంలో తన అడ్డులేనిదే గోడ మీద రాత కూడా వుండడానికి లేదని శాసిస్తున్నారు. రాసిన రాతలు చెరిపేయడమే కాదు - తనకు చెప్పకుండా కావలి గ్రామాల్లో ప్రచారానికి వచ్చారని కోప్పడి; మెగాఫోన్, మేబారెలను తరిమి కొట్టారట. పాపం వారిద్దరూ యానాదిరెడ్డి కోపం చూసి,

కొరప 7 పేజీలో

### దేశం

- పాకనాటి రెడ్లు ఏకమౌతున్నారు
- స్థానికుడన్న అనుకూలత
- లక్ష్మీపార్వతి నాయకులను మంచి చేసుకోవడంలో సక్సస్
- చావో, బ్రతుకో తేల్చుకోవాలన్న తీరులో రాజమోహన రెడ్డి పోరాటం

### కాంగ్రెస్

- యానాదిరెడ్డి ఏడ్పించేస్తున్నాడు!
- మాగుంట చేసిన మంచి పనులే ఓట్ల రాశి పోస్తాయని ఆశ
- ఆశించిన ధన ప్రవాహం లేక పోవడంతో అనుచరుల్లో నిరాశ
- యాదవుల్లో వ్యతిరేకత
- పార్వతమ్మ గ్లామర్‌తోనే గెలవాలి!

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సం చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

SUMMER BATCHES
ఇంగ్లీషు నేర్చుకొంటారా!
(Speaking & Writing)
చెప్పేది తెలుసు - కాని తిరిగి మాట్లాడేది రాదు
నేర్చుకోండి - తెలుసుకోండి - మాట్లాడండి
(కాలేజి / స్కూల్ విద్యార్థులు - మరి ఎవరైనా)
లయోలా కాలేజీ
Ph: 29292 20 యేండ్ల సంస్థ
వి.ఆర్.సి. సెంటర్ - నెల్లూరు.

numbur
నంబూరు లేబొరేటరీస్
15/206, బృందావనం, నెల్లూరు -1. ఫోన్: 27337
క్లర్కులు - అకౌంటెంట్లు కావలెను
మా వద్ద క్లర్కులు, అకౌంటెంట్స్‌గా పని చేయుటకు ఇంగ్లీషు చదవడం, వ్రాయడం, మాట్లాడ గలిగి మంచి అనుభవం గల వారు తమ బయోడేటా, పాస్‌పోర్ట్ ఫోటోతో వెంటనే దరఖాస్తులు పంపండి.
Sri Saibaba Ads

## నెల్లూరు [illegible] విలక్షణుడు

### జనార్ధనరెడ్డి

మాజీ ముఖ్యమంత్రి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి 13 తేది శనివారం నెల్లూరు వస్తున్నారు. ఆ రోజంతా వాకాడులో మకాం. 14 తేది ఆదివారం నెల్లూరులో వి.ఆర్. కాలేజి భవనాల ప్రారంభోత్సవం; మైనారిటీలతో ఎన్నికల సమావేశం; సాయంత్రం వర్వేపల్లికి చెందిన నరుకులో సభ; రాత్రికి, వాకాడు. 14 తేది తిరుపతిలో ఎన్నికల ప్రచార సభలు. ఆ సాయంత్రమే ఆత్మకూరులో బహిరంగ సభ.


**కోవూరు సబ్ జడ్జి కోర్టులో**

S.C. No. 92/95

పినాకిని గ్రామీణ బ్యాంకు, కోవూరు rep. by its Manager -వాది

Vs

నెల్లా జనార్ధన్ -ప్రతివాది

To, నెల్లా జనార్ధన్

S/o. శేషయ్య, కోవూరు

మీ మీద పై దావా వేసి మీకు నోటీసు నిమిత్తము 15.4.96 తేదికి వాయిదా వేసినారు కనుక ఆ దినము మీరు ఉదయం 10.30 గంటలకు పై కోర్టు వారి యెదుట హాజరు అయి ఆక్షేపణ తెలుపు కొనవలె మీ పరోక్ష మందు తీర్మానము చేయుదురు.

ఆర్.కె. శర్మ

వాది అడ్వకేటు, కోవూరు



హరిఓమ్

**శ్రీశ్రీశ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారి 305వ సంవత్సరం ఆరాధన ఆహ్వానము**

కోటంరెడ్డి శంకరరెడ్డి మెమోరియల్ హాల్, అలగానిపాడు గ్రామము

సంసారమందుండియు సంసారమును మిథ్యజేసి సర్వము తానై హంసోహ మునందు నిలిచిన సంసారి రాజయోగి సత్యము సిద్దా!

పురుషులందు పుణ్యపురుషులు వేరయా

దైవత్వస్వరూపులైన ఆత్మబంధువులారా శ్రీ వీరబ్రహ్మంగారి ఆరాధన 28.4.96 తేది ఉ. 10.00 గంటలకు కోటంరెడ్డి శంకరరెడ్డి మెమోరియల్ హాల్‌లో గంధవరపు కృష్ణారెడ్డి ఆధ్వర్యమున జరుగుతున్నది. తామెల్లరు కుటుంబ సమేతముగా విచ్చేసి సూర్యచంద్రాదులు ఉన్నంతవరకు ఉండే ఆశీర్వాదము పొందగలరని ఆహ్వానించడమైనది. వంశానికి తగ్గ కీర్తి ప్రతిష్టలు లేకపోవడానికి గల కారణమేమి? ధన బలము, కండ బలము, బుద్ధి బలము గాదు. ధర్మ బలము, దైవ బలము పొంది కీర్తి శిఖరాలనందుకోండి.

కోటంరెడ్డి దశరథరామరెడ్డి గారి కుమారులు, అలగానిపాడు.


### పెళ్లకూరు పేరుతో ఇఫ్కో ట్రస్ట్

స్వర్గీయ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి పట్ల తనకున్న స్నేహ భావాన్ని, ఆయన మరణా నంతరమూ విస్మరించలేదు ప్రధాని శ్రీ పివి నరసింహా రావు. పెళ్లకూరు పేరుతో, ఇఫ్కో సంస్థ తరపున ధర్మ కార్యాల ట్రస్టును నెలకొల్పించా రాయన. ఏడుగురు సభ్యులు గల ఈ ట్రస్ట్‌లో పెళ్లకూరు కుటుంబ సభ్యులిద్దరు వుంటారు. ఒక సభ్యుడ్ని ప్రధాన మంత్రి స్వయంగా నియమిస్తారు. నెల్లూరు నుంచి ఇద్దరు ప్రముఖులను ఎంపిక చేస్తారు. తక్కిన వారు ఇఫ్కో డైరక్టర్లు.

ప్రారంభంగా - 5 లక్షల మూల ధనంతో ట్రస్ట్ ఏర్పడింది. ఇతర అనుబంధిత సంస్థల నుంచి ఇఫ్కో విరాళాలు స్వీకరించి, ఈ పెట్టుబడిని పెంచ బోతున్నారు. వికలాంగులకు సహాయం, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలు, విద్యా సంబంధిత వ్యవహారాలలో ట్రస్ట్ పాలు పంచు కొంటుంది.

పెళ్లకూరు కుమారులు - వసంత కుమార రెడ్డి, ప్రభాకర రెడ్డి; శ్రీ నూకలపాటి వెంకా రెడ్డి, డాక్టర్ కె. రాజమ్మ ట్రస్ట్ సభ్యులుగా నియమితు లైనారు.

స్నేహితుడి పట్ల మరణా నంతరమూ అభిమానం ప్రదర్శించిన పివి అభినంద నీయుడు.

### అర్ధరాత్రి పర్యటనలు- నాయకుల అగచాట్లు

రాత్రి 10 గంటల తర్వాత సభలు, సమావేశాలు జరప రాదని శేషన్ నియంత్రించడంతో నాయకులు అగచాట్ల పాలౌతున్నారు. 10 తేది రాత్రి -వేళ మించి పోయిందని ముఖ్య మంత్రి చంద్రబాబు కావలి, కోవూరు, గూడూరు సభలు రద్దు చేసు కోవలసి వచ్చింది. 9 తేది రాత్రి సూళ్లూరు పేటలో శ్రీమతి లక్ష్మీపార్వతికి ఇదే అనుభవం ఎదురైంది.

* * *

ఈ వారంలో కాంగ్రెస్ తరపున పిసిసి అధ్యక్షుడు శ్రీ కె. రోశయ్య; సిపిఎం పక్షంగా శ్రీ మోటూరి హనుమంత రావు, శ్రీ ఏచూరి సీతారాం, నెల్లూరుకు రానున్నారు. లక్ష్మీపార్వతి కార్యక్రమం ఇంకా ఖరారు కాలేదు. బిజెపి నాయకు లెవరూ రావటం లేదు.

### వ్యయ పరిశీలకుడు

నెల్లూరు నియోజక వర్గం ఎన్ని[illegible] వ్యయ పరిశీలకుడు శ్రీ ఎ.ఐ. అగర్వాల్ పూనా నుంచి 12 తేది నెల్లూరు వస్తున్నారు; 17 తేది వరకు అక్కడే వుంటారు.

ఎన్నికల సాధారణ పరిశీలకుడు శ్రీ రాఘవ చంద్ర 15 తేది నెల్లూరు వస్తున్నారు. అభ్యర్థులకు ఎన్నికలకు సంబంధించి ఏవైనా ఫిర్యాదు లుంటే ఆయనకు తెల్పు కోవచ్చునని కలెక్టర్ గారు తెలియ జేస్తున్నారు.

### మునిసిపల్ ఉద్యోగికి కారాగార శిక్ష

నెల్లూరు మునిసి పాలిటీ ఇంజనీరింగ్ విభాగంలో ఎజా పని చేస్తున్న నందానికి ఎ[illegible]రు కారాగార వాస శిక్ష విధించింది. 1986 లో ఆయన ఇంటి పై ఎసిబి దాడి జరిగింది. ఆదాయానికి మించి ఆస్తులున్నాయనే నేరంతో ఆయన పై ఎసిబి కోర్టులో కేసు పెట్టారు. విచారణలో అది రుజువు కావటంతో నందానికి మూడేళ్ల కఠిన కారాగార శిక్ష, 30 వేల రూపాయల జరిమానా విధించారు న్యాయమూర్తి.

ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా శ్రీ సేతు మాధవ రావు వాదించారు.

### పుండరీ కాక్షం గారికి పితృవియోగం

నెల్లూరులో లీడింగ్ ఆడిటర్ శ్రీ ఆకు పుండరీ కాక్షం గారి తండ్రి వెంకట రమణయ్య 1 తేది మరణించారు. ఆయన వయస్సు 85 సంవత్సరాలు; ముగ్గురు కుమారులు, నలుగురు కుమార్తెలు వున్నారు.

పుండరీ కాక్షం గారి తల్లి ఇటీవలే స్వర్గస్తు రాలైనారు. స్వల్ప వ్యవధిలో తల్లి తండ్రులిద్దర్నీ కోల్పోయిన పుండరీ కాక్షం గారికి మా సాను భూతి.

### డాక్టర్ సత్యనారాయణ దశమ వార్షికోత్సవం

డయాబెటీషియన్ డాక్టర్ సత్యనారాయణ మూర్తి తమ క్లినిక్ దశమ వార్షి కోత్సవాన్ని ఇటీవల సింపుల్‌గా జరిపించారు. సత్య నారాయణ మూర్తి నెల్లూరులో తొలి డయా బెటాలజిస్ట్. కాలేజిలో చదివిన చదువే కాకుండా మధ్య మధ్యలో సందు దొరికి నప్పుడల్లా విదేశాలకు వెళ్లి, అధునాతన శాస్త్ర పరిజ్ఞానంలో పాండిత్యం సంపాదించి, అక్కడి నుంచే పరికరాలు తెచ్చి ఇక్కడి చక్కెర రోగులకు స్వస్థత చేకూరుస్తుం టారాయన. మంచి హస్తవాసి కల్గిన డాక్టరు. ఆయన క్లినిక్ ఇటువంటి వార్షికోత్సవాలు మరిన్ని జరుపు కోవాలని ఆకాంక్షిస్తున్నాము.


**కృతజ్ఞతాభివందనాలు**

నన్ను నెల్లూరు జిల్లా రైల్వే యూజర్స్ అసోసియేషన్ అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్న అసోసియేషన్ సభ్యులకు, శుభాకాంక్షలు తెల్పిన మిత్రులకు, శ్రేయోభిలాషులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

రొటేరియన్ యన్నమూరి వెంకటేశ్వరరావు

ఉపాధ్యక్షులు: ది నెల్లూరు [illegible] అసోసియేషన్

[illegible] నెల్లూరు

Sri Saibaba Ads


### సణుగుడు

అవార్డు లభించినా ఆశ్చర్యం లేదు. ఈ సినిమాల వల్ల ఆయనకు చిల్లి గవ్వ ఆదాయం రాదు; కళా రంగం అభివృద్ధికి తన వంతు కృషి చేశానన్న ఆత్మ సంతృప్తి మాత్రమే లభిస్తుంది. ఇటువంటి సామాజిక లక్ష్యానికి వున్నదంతా ధార్పి పెట్టే వుదారు లెవరున్నారు చెప్పండి - ఈ కమర్షియల్ లోకంలో?

సుబ్బరామి రెడ్డి గారికి చాలా కాలం నుంచి రాజకీయ సంబంధా లున్నాయి. ఢిల్లీ స్థాయి నుంచి పలుకుబడి వుంది. కాని ఎప్పుడూ రాజకీయ పదవులు పొందలేదు. టిటిడి బోర్డు ఛైర్మన్ పదవి ఒక్కటే చెప్పుకో దగింది. కేంద్ర ఫిలిం సెన్సార్ బోర్డు ఛైర్మన్‌గానూ వుండినారు.

సుబ్బరామి రెడ్డి గారు మహా గొప్ప శివ భక్తుడు; పూజారుల సహాయం లేకుండా తానే పూజారిగా రుద్రయాగం నిర్వహించ గల్గిన మంత్ర పరిజ్ఞానం వుంది. గాయత్రీ మంత్రో పాసకుడు, చాలా కఠినమైన నిష్ఠ క్రమ శిక్ష పాటిస్తా రాయన తన దిన చర్యలో. అందువల్లే ఆయనలో వయస్సు కన్పడదు - జనం అభిమానం, శివాను గ్రహం కల్గిన సుబ్బరామి రెడ్డి గారికి ఎన్నికలలో ఓటమి అసంభవం. ఆయన ఎమ్పీగా గెలవడం ఖాయం.

సుబ్బరామి రెడ్డి గారికి మా విజయా కాంక్షలు.

* * *

పార్లమెంట్ సభ్యుడిగా వుండడానికి అర్హతలు, ఎమ్పీగా రాణించ డానికి కవసరమైన సమర్థత, చతురత, లోకజ్ఞానం, దేశ పరిస్థితుల పట్ల అవగాహన తదితరాల ఆధారంగా రాష్ట్రంలో ఎన్నికల బరిలో నిలబడి వున్న అన్ని పార్టీల అభ్యర్థుల నుంచి ఒక జాబితా తయారు చేయవలసి వస్తే -అందులో మొదటి లేదా రెండవ స్థానంలో వుండ దగిన నాయకుడు శ్రీ

ఎం. వెంకయ్య నాయుడు. బిజెపి అభ్యర్థిగా హైదరాబాదు నుంచి పోటీ చేస్తున్న ఈ నెల్లూరు ముఖ్యుడి గురించి నెల్లూరీయులకు చెప్ప బోవడం అమ్మ పుట్టింటి ఘనతను మేనమామకు చెప్పి నట్లుంటుంది.

వెంకయ్య నాయుడు గారు ఎప్పుడో పార్లమెంట్‌కు వెళ్లవలసిన వారు. రాజకీయాలలో అర్హత కంటే అదృష్టానికి మున్నన ఎక్కువ కదా? పార్లమెంట్‌లో వుండి వుంటే ఆయని పాటికి పేరెన్నిక గన్న పార్లమెంటే రియన్‌గా దేశ ఖ్యాతి పొంది వుండేవారు. నాయుడు గారి వాక్చాతుర్యం; విశ్లేషణా నైపుణ్యం; దేశ కాల పరిస్థితులకు, సంఘటనలకు స్పందించే తీరవ అమోఘమైనవి. ఎమ్మెల్యేగా వున్న ఆరేడేళ్లు ఆయన తన సమర్థతను చాలా గొప్పగా రుజావు చేసుకున్నారు.

వెంకయ్య నాయుడు గారి పోటీ - ముస్లింల ప్రాధాన్యత కల్గిన నియోజక వర్గంలో జరుగుతూంది; అందులోనూ సలావుద్దీన్ ఒవైసీ సామాన్యుడు కాడు. అక్కడ పోటీ చేయడం ద్వారా చాలా రిస్క్ తీసుకున్నా రాయన. అయినప్పటికీ ఆయన గెలవాలని, నెల్లూరు ప్రతిష్ఠ పార్లమెంట్‌లో ప్రతిధ్వనింప జేయాలని నా ఆకాంక్ష.

వెంకయ్య నాయుడు గారి బిజెపి మతోన్మాద సిద్ధాంతాల పట్ల నాకు చాలా విముఖత; కానీ రాజకీయ వాదిగా ఆయన సమర్థత, జన రంజకత్వం పట్ల నాకు అభిమానం. ఆయన కాంగ్రెస్‌లో వుండి వుంటే ఎంత బాగుండేదో!

7 పేజీ కొరవ

### తిరుపతి

7 పేజీ కొరవ

రారు; పేరు గొప్ప తప్ప ఆయనలో పస లేదు. నగరి దొరస్వామి రాజాకు ధన బలం తప్ప, జన బలం లేదు; ఓట్లడ గడానికి పూళ్లలోకి పోతే ఆయన దుమ్ము దులపడానికి సిద్ధంగా వున్నారు జనం. ఒక్క కాళహస్తి గోపాల కృష్ణారెడ్డి మాత్రమే రాజశ్రీని వెంట బెట్టుకొని తిరిగి ఓట్లు తెచ్చి పెట్టగల్గిన నాయకుడు. అందువల్లనే శంఖారావం సక్సెస్ తర్వాత కూడా రాజశ్రీ డీలాపడి వుంది.

పోలింగ్ తేదికి ఇంకా రెండు వారాల వ్యవధి వున్నప్పటికీ, గెలుపు ఓటములు అంచనాలు ఇప్పుడు చేయడం తొందరపాటుగా కన్పించి నప్పటికీ - తిరుపతి విషయంలో కాంగ్రెస్ మెరుగ్గా వుందని చెప్పడం తప్పు కాబోదు. లక్ష్మీపార్వతి అభ్యర్థి శ్రీ మురుగయ్య కొంచెం గట్టి పోటీ ఇచ్చి వుంటే పరిస్థితి ఇంత తేటతెల్లంగా వుండేది కాదు. కాని ఆయన దురదృష్టం - ముద్దు కృష్ణమ నాయుడు స్వయంగా చిత్తూరులో పోటీ చేయడం. మురుగయ్య బాధ్యతంతా తాను తీసుకొని, టిక్కెట్ ఇప్పించారు ముద్దు; అప్పటికి ఆయనకు చిత్తూరులో పోటీ చేసే వుద్దేశ్యం లేదు. కాని, ఇప్పుడక్కడ ఇరుక్కొని పోవడం వల్ల ఇటు ప్రచారంలో, అటు వనరుల కల్పనలో మురగయ్యకు సాయం చేయడం ఆయన తరం కావడం లేదు. రెండు చోట్ల ఎన్నిక నిర్వహించ గల్గిన సామర్థ్యం ముద్దుకు లేదు. అందువల్ల తిరుపతి వదిలేసి, చిత్తూరుకు అంకితమై పోయాడు. వ్యక్తిగత ప్రాబల్యం కోసం తన స్వంత నియోజక వర్గమైన పుత్తూరులో మాత్రం మురగయ్యకు మెజారిటీ తెచ్చి పెడ్తాడేమో! ఆ ఓట్ల చీలిక చాలు - కాంగ్రెస్ సుబ్రహ్మణ్యం గెలుపుకు!

బిజెపి తరపున శ్రీ కె. పట్టాభి రంగంలో వున్నారు. ఇది నామకార్థపు పోటీ. పాతిక వేల ఓట్లకు పరిమితమై డిపాజిట్ కోల్పోయినా ఆశ్చర్యం లేదు.

### తిరుపతిలో 17 మంది

| అభ్యర్థి పేరు | పార్టీ |
|---|---|
| ఎన్. సుబ్రహ్మణ్యం | కాంగ్రెస్ |
| డాక్టర్ జి. రాజశ్రీ | టిడిపి |
| ఎం. మురగయ్య | ఎన్టీఆర్ టిడిపి (లక్ష్మీపార్వతి) |
| కె. పట్టాభి | బిజెపి |
| ఎం. జయరామయ్య | తివారీ కాం. |

పి. నాగరత్నం (ఇండి); పి. తులసి (ఇండి); పి. మస్తానయ్య (ఇండి); కె.ఎన్. మునిరత్నం (ఇండి); ఎన్. మునెప్ప (ఇండి); పి. లోకేశులు (ఇండి); పి. విజయ కుమార్ (ఇండి); పి. పెదపెంచలయ్య (ఇండి); బి. శంకరయ్య (ఇండి); ఎం. సుబ్రహ్మణ్యం (ఇండి)

# తిరుపతిలో పరిస్థితి తేటతెల్లం!

జిల్లాలోని తక్కిన రెండు నియోజక వర్గాల కంటే తిరుపతిలో ఎన్నికల వాతావరణం స్పష్టంగా వుంది. ఒంగోలులో వలెనే ఇక్కడా కాంగ్రెస్, చంద్రబాబు తెలుగు దేశం పార్టీల మధ్య పోటీ కేంద్రీ కృతమౌతున్నది. లక్ష్మీపార్వతి అభ్యర్థి పోటీలోకి రావడం లేదు.

తిరుపతి ఇటు ముఖ్య మంత్రి శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడుకు, అటు మాజీ ముఖ్య మంత్రి శ్రీ ఎన్. జనార్దన రెడ్డికి ప్రతిష్టాకరమైన నియోజక వర్గం. చంద్రబాబు గారి కిది స్వంత స్థానమైతే; జనార్ధన రెడ్డి ఇక్కడ తన అభ్యర్థిని నిల్పి వున్నారు. అది గాక తిరుపతి ఎమ్పీకి దేశ రాజకీయాలలో చాలా ప్రాధాన్యత వుంటుంది. కేంద్ర మంత్రులు, ఉన్నతాధి కారులు, విదేశీ రాయబారులు, బడా బడా పారిశ్రామిక వేత్తలు దైవ దర్శనానికి వచ్చేటప్పుడల్లా ఎమ్పీ సహాయం కోరుతుంటారు. అందువల్ల ఇక్కడ గెలుపు ఓటములకు ఢిల్లీ స్థాయిలో గుర్తింపు లభిస్తుంది.

కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ ఎన్. సుబ్రహ్మణ్యం, బాబు క్యాండిడేట్ డాక్టర్ రాజశ్రీ ఇద్దరూ రాజకీయాలకు పూర్తిగా కొత్త వారు; ఇద్దరూ విద్యాధికులే; ఇద్దరూ నెల్లూరీయులే. సుబ్రహ్మణ్యం నాయుడు పేట దగ్గర భీమవరం గ్రామస్తులైతే; రాజశ్రీ నెల్లూరు పత్తేఖాన్ పేట నివాసి.

రాజశ్రీ ప్రచారం చాలా జోరుగా వుంది. నియోజక వర్గంలోని ఏడు అసెంబ్లీ స్థానాలలో ఆరింట చంద్రబాబు ఎమ్మెల్యే ఉండడం ఆమెకు కలిసొస్తోంది. ఒక్క పుత్తూరులో మాత్రమే లక్ష్మీపార్వతి ఎమ్మెల్యే శ్రీ ముద్దు కృష్ణమ నాయుడు వున్నారు. తిరుపతిలో చంద్రబాబు జరిపిన శంఖారావం సదస్సు విజయ వంతం కావడం ఆమెకు శుభారంభం. ఆ సభ జనార్ణవంగా జరిగింది. అంత మంది జనం వస్తారని చంద్రబాబూ వూహించలేదు. ఆమె ప్రచారానికి వనరుల సమస్య బాధ్యత వినంపి దొరస్వామి రాజా తీసు కోవడంతో డబ్బుకు వెతుకులాట లేదు. అవసరమైతే పెట్టెలు గుమ్మరించగల స్తోమత వుంది దొరస్వామికి.

కాంగ్రెస్ సుబ్రహ్మణ్యం ప్రచార బాధ్యతను చదలవాడ కృష్ణమూర్తి, పసల పెంచలయ్య, రెడ్డి వారి రాజశేఖర రెడ్డి, వెంగారెడ్డి, సుబ్బురామి రెడ్డి తదితరులంతా సమష్టిగా నిర్వహిస్తున్నారు. వీరంతా మొన్నటి అసెంబ్లీ ఎన్నికల్లో స్వల్ప తేడాతో ఓడి పోయిన వారు. అందువల్ల తెలుగు దేశం పై కసితో పని చేస్తున్నారు. చింతా మోహన్ కూడా ప్రచారానికి వచ్చి వుంటే చాలా బాగా వుండేది. కాని ఆయన టిక్కెట్ రాని ఆశాభంగంలో వున్నారు.

అసెంబ్లీ ఎన్నికల్లో తిరుపతిలోని ఏడు స్థానాలలోనూ కాంగ్రెస్ ఓడిపోయి నప్పటికీ, కాంగ్రెస్ నాయకులు కార్యకర్తలు కూడా వుత్సాహం కోల్పోకుండా పని చేయడం సుబ్రహ్మణ్యం అదృష్టం. జనార్దన రెడ్డి తెర వెనుక వుండి, అందర్నీ పురమాయిస్తున్నారు. చదలవాడ కృష్ణమూర్తి బా... పెద్ద లీడ్ తీసుకొని పని చేస్తున్నారు. తిరుపతి నుంచి శ్రీకాళహస్తి ద్వారా నాయుడు పేట వరకు తన శక్తి వంచన లేకుండా కృషి చేస్తున్నారు కృష్ణమూర్తి. తిరుపతిలో వబ్బు రామిరెడ్డి, చదలవాడ కృష్ణమూర్తి కలిసి పని చేయడం; సూళ్లూరు పేటలోనూ కృష్ణమూర్తి, పసల పెంచలయ్య చేయి చేయి కల్పడం సుబ్రహ్మణ్యం అదృష్టం. వెంకటగిరిలో జనార్ధన రెడ్డి మనిషి అన్న ప్రతివాడూ - అసెంబ్లీ ఎన్నికల పరాభవానికి సమాధానం చెప్పాలన్న పంతంలో అహోరాత్రులు పని చేస్తున్నారు. ఒక్క వెంకటగిరిలోనే సుబ్రహ్మణ్యానికి గెలుపుకు తగిన మెజారిటీ వచ్చినా ఆశ్చర్యం లేదు.

తెలుగు దేశం ఎమ్మెల్యేలు ఎన్టీఆర్ గాలిలో గెల్చిన వారే తప్ప స్వతహాగా బలం కల్గిన వారు కాదు. తిరుపతి మోహన్, సత్యవేడు సురాజ్, సూళ్లూరు పేట పరసా రత్నం కేవలం గాలిలో ఎగిరి వచ్చిన వారే; వారేమి చేయగలరు పాపం? వెంకటగిరి రాజా వారుంటే, ప్యాలస్ దాటి బయటకు

కొరవ 7 పేజీలో

- ◎ ఒక్క ఎమ్మెల్యే లేకున్నా కాంగ్రెస్‌కు కొరత కావడం లేదు!
- ◎ శంఖారావం సక్సెసైనా బాబు దేశం డీలాపడిపోయింది!
- ◎ లక్ష్మీపార్వతి దేశం స్టార్టింగ్ ట్రబుల్‌తోనే సతమత మౌతూంది!

### అత్తా అల్లుళ్ళు

మొదటి పేజీ కొరవ

తెలుగు దేశం పార్టీల తిట్లు, శాప నార్థాలు, ఛీత్కారాలు, సిగ్గు ఎగ్గులేని ప్రవర్తనల వల్ల జనంలో ఆ పార్టీల పట్ల విరక్తి కల్గుతూంది. తెలుగు దేశమంటే ముఖం మొత్తి నట్లుండడంతో కాంగ్రెస్ పరిస్థితి దానంతటదిగా మెరుగు పడుతూంది.

తెలుగు దేశం ఓట్ల చీలిక కాంగ్రెస్‌కు వర ప్రసాదితమే! పిట్టపోరు పిట్ట పోరు పిల్లి తీర్చినట్లు, అత్తా, అల్లుళ్ల కీచులాటలతో కాంగ్రెస్ లాభ పడుతూంది. ఆ లాభం ఎంత అనేది చీలే ఓట్ల శాతాన్ని బట్టి ఆధార పడి వుంటుంది. ఈ విభజనలో ఎవరిది పై చేయి అన్న అంచనా వీలు కావడం లేదు. లక్ష్మీపార్వతి సభలకు వచ్చే జనాన్ని చూస్తే, ఎన్టీఆర్ రాజకీయ వారసత్వం ఆమెదేనని భావించాలి.

కాని అభ్యర్థుల ఎంపికలో అనుభవ రాహిత్యం, తొందర పాటు, అహంభావ వైఖరులతో లక్ష్మీపార్వతి తన విజయావ కాశాలను తానే నీరు గార్చేసు కున్నారు. ఆమె కొంచెం సంయమనంతో వ్యవహరించి వుంటే చంద్రబాబు చాలా సమస్యలలో పడిపోయి వుండేవారు. ఆమె అభ్యర్థులు బలహీనులైన చోటల్లా ఆయనిప్పుడు బలపడు తున్నారు. ఈనాడు దిన పత్రిక, ఈటివిలు ఆయన్ను ఆకాశానికెత్తి, ప్రజలను మభ్య పెట్టడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్నాయి. ఈ ప్రచార ప్రభావం ఓటర్ల పై ఎంత వరకు వుంటుందో వేచి చూడాలి.

ఈ అత్తా, అల్లుళ్ల అగం నుంచి వాతావరణాన్ని తమ కనుకూలంగా మార్చుకొను కాంగ్రెస్ ఎటువంటి కృషి చేయడం లేదు. వారికా విషయమే పట్టడం లేదు.

### ఒంగోలు

5వ పేజీ కొరవ

భయపడి పోయి కారెక్కి నెల్లూరుకు పరుగులు పెట్టి నట్లున్నారు.

ఒంగోలు ఎన్నిక తీరు తెన్నులివి! ఇప్పటి వరకు పరిస్థితిని గమనిస్తే ఇక్కడ ఎవరి బండి నల్లేరు పై నడవదని నికరంగా చెప్పాల్సి వస్తున్నది. కానీ మాగుంట కుటుంబీకులలో ఆ అధైర్యం లేదు. రాష్ట్రంలో కెల్లా మెజారిటీలో తామే ముందుం టామన్న ముఖస్తుతి మాటలు ఆ శిబిరంలో బాగా విన్పిస్తున్నాయి. గెలుపు గ్యారంటీ - మెజారిటీ లక్షా, రెండు లక్షలా అన్న చర్చలూ జరుగు తున్నాయి. అదే వైఖరిలో వారుంటే మాత్రం చాలా ప్రమాదం. ఎన్ని మాట్లాడినా రాజమోహన రెడ్డి స్థానికుడు, బలవంతుడు, ఆయనకు కూడా నియోజక వర్గంలో మంచి పేరు, కమిట్‌మెంట్ కల్గిన అనుచర వర్గం వుందన్న వాస్తవం గ్రహించి మసలు కొంటే కాంగ్రెస్ విజయావ కాశాలు మెరుగు పడ్తాయి.

* * *

ఇక్కడి బిజెపి అభ్యర్థి శ్రీ శ్యామ్యూల్ జార్జి విచిత్ర వ్యక్తి. అమెరికాలో చదివి, స్థానికంగా విద్యా సంస్థలు స్థాపించిన వాడాయన. సంపన్నుడు, గత అసెంబ్లీ ఎన్నికల్లో మార్కా పురం నుంచి స్వతంత్రుడిగా పోటీ చేసి 10 లక్షలు ఖర్చు పెట్టి కేవలం 300 ఓట్లు సంపాదించి, అభాసు పాలైనా డాయన. ఇప్పుడూ అన్ని పార్టీల టిక్కెట్లకు ప్రయత్నించి, విఫలుడై, చివరలో బిజెపిని ఆశ్రయించాడు. వారూ ఎవరు దొరకతారా అని ఎదురు చూస్తుండడంతో, అడగగానే టిక్కెట్ ఇచ్చేశారు.

దళితులను ఆకర్షించ డానికి జార్జి విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. చర్చిలకు వెళ్లి ఓట్లడుగు తున్నారు. ఆయన ఏ పది, పదిహేను వేల దళిత ఓట్లు చీల్చినా అది కాంగ్రెస్‌కు నష్టమే!

### ఒంగోలులో 48 మంది

ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గం నుంచి భారీ సంఖ్యలో 48 మంది అభ్యర్థులు రంగంలో వున్నారు. వారి వివరాలు

| అభ్యర్థి పేరు | పార్టీ |
|---|---|
| మాగుంట పార్వతమ్మ | కాంగ్రెస్ |
| మేకపాటి రాజమోహనరెడ్డి | టిడిపి |
| గుత్తా వెంకటసుబ్బయ్య | ఎన్టీఆర్ టిడిపి |
| సామ్యూల్ జార్జ్ | బిజెపి |

ఎ. రంగారావు (ఇండి); ఎ.పి. సుబ్బయ్య (ఇండి); కె. అంజిబాబు (ఇండి); కె. ప్రభాకర రావు (ఇండి); కె. వెంకట సుబ్బయ్య (ఇండి); జి. సుబ్బరామ రాజా (ఇండి); బి. రమణా రెడ్డి (ఇండి); సి. దేవదాసు (ఇండి); సి. రమణా రెడ్డి (ఇండి); జె. మోక్షానందం (ఇండి); డి. చంద్రశేఖర్ (ఇండి); ఎన్. శ్రీనివాస రావు (ఇండి); డి. సీతారామిరెడ్డి (ఇండి); ఎన్. పేరిరెడ్డి (ఇండి); పి. నాగేశ్వర రావు (ఇండి); ఎం. జోసఫ్ ప్రకాశ రావు (ఇండి); ఎం. మాల్యాద్రి (ఇండి); కె. రత్తయ్య (ఇండి); డి. రామకోటి వరప్రసాద రావు (ఇండి); ఎం. నామయ్య (ఇండి); ఆర్. తిరుపతి రెడ్డి (ఇండి); ఆర్. మాలకొండయ్య (ఇండి); పి. లక్ష్మయ్య నాయుడు (ఇండి); ఎల్. అంజిరెడ్డి (ఇండి); వి. లింగబత్తుడు (ఇండి); పి. రామిరెడ్డి (ఇండి); ఎం. వెంకట దుర్గారావు (ఇండి); ఆర్. వెంకట రావు (ఇండి); ఎస్. వెంకటయ్య శెట్టి (ఇండి); జి. రాంబాబు (ఇండి); ఎన్. శ్రీనివాస రావు (ఇండి); షేక్ ఖలీఫాతుల్లా బాషా (ఇండి); షేక్ ఇఫ్తికర్ బాషా (ఇండి); షేక్ పాచయ్య (ఇండి); ఎ. చిన్న పింగయ్య (ఇండి); వి. వెంకట్రావు (ఇండి); కె. బాషాజి (ఇండి); కె. పిచ్చయ్య (ఇండి); ఎస్. వెంకట సుబ్బయ్య (ఇండి)

### సణుగుడు

4 పేజీ కొరవ

సభలెన్నో జరిపించారు. ఈ దాన ధర్మాల కంటే ప్రశస్తమైనది - ఆయన కళాపిపాస. నెల్లూరు కుబేరులు ఎంద రెందరో సినిమా రంగంలో బారుగా వ్యాపారం చేసి, జోరుగా సంపాదిస్తుంటే - సుబ్బరామ రెడ్డి గారు కోట్ల రూపాయలు మంచి నీళ్ల వలె వ్యయం చేసి భారత దేశం గర్వించ దగ్గ కళా ఖండాలు సృష్టిస్తున్నారు. ఆయన "భగవద్గీత"కు ప్రపంచ ఖ్యాతి లభించింది; ఇప్పుడు తీస్తున్న 'వివేకానంద' విడుదలైతే ఆస్కార్

కొరవ 7 పేజీలో

### నెల్లూరు

2 పేజీ కొరవ

ఏ పార్టీ నిజమైన తెలుగు దేశమో తెల్సుకోలేని ఓటరు గందర గోళం, ఆ రెండు పార్టీలలో వ్యవస్థా పరంగా ఎదురౌతున్న సమస్యలు, యంత్రాంగ వైఫల్యాలు కాంగ్రెస్‌కు వర ప్రసాదితాలు. ఎన్నిక చివరి రోజు వరకు ఈ అనుకూలతే కొనసాగేటట్లు చేసు కోవడంలో కాంగ్రెస్ విజయం ఆధారపడి వుంటుంది.

### రంగంలో 18 మంది

నెల్లూరు పార్లమెంటరీ నియోజక వర్గంలో 18 మంది అభ్యర్థులు పోటీ పడుతున్నారు. వారి వివరాలు

| అభ్యర్థి పేరు | పార్టీ పేరు |
|---|---|
| పనబాక లక్ష్మి | కాంగ్రెస్ |
| తుమ్మలగుంట ప్రపంచ భానురాజా | సిపిఎం |
| పోశం సునీల్‌కుమార్ | ఎన్టీఆర్ తెలుగుదేశం పార్టీ (లక్ష్మిపార్వతి) |

అబ్బాల అబ్రహాం (ఇండి); అత్తిన రామయ్య (ఇండి); అరగల ఐజాక్ (ఇండి); ఇండ్లూరి అరవిందయ్య (ఇండి); ఉంద్రాళ్ల ప్రసాద్ (ఇండి); గోద కృష్ణయ్య (ఇండి); జెడ్డా మోహన్ (ఇండి); దావులూరి మాలకొండయ్య (ఇండి); దుగ్గిరాల రామయ్య (ఇండి); పానెం పిచ్చయ్య (ఇండి); ముత్తుకూరు వెంకటేశ్వర్లు (ఇండి); బిజూరు నాగభూషణమ్మ (ఇండి); బెల్లపల్లి ఆశీర్వాదం (ఇండి); వెలిచర్ల వెంకట రావు (ఇండి).

In the Court of Addl. Subordinate Judge of Chittoor
O.E.P. No. 54 of 1995
S.C. No. 95 of 1994

Shri Venkateswara Grameena Bank, Chittoor Branch, rep. by its General Manager - Decree holder
Versus
Smt. S. Chinnamma & Others - Judgement Debtors

**AUCTION NOTICE**

Madam / Sirs,

The properties mentioned in the schedule hereunder will be sold in the court auction in 22.4.1996 between 10.30 A.M. to 5.00 P.M. in the premises of the above said court. The intending bidders may participate in the auction to be conducted by the court.

**Schedule**

Chittoor district - Chittoor sub - district - Chittoor Mandal - Thumminda Chennasamudram village accounts.

1. S.No. 203/2 - Dry - 0.69 acres.
2. S.No. 205/1 - Dry - 0.60 acres.
3. S.No. 203/3 - Dry - 0.21 acres.
4. S.No. 204/8 - Dry - 0.60 acres.

The above lands are situated within the following boundaries:
East: Munirajulu's land; West: Kubera Ganga Mandadi's land; North: Mogilappa's land; South: Lakka Mandadi's land
D.Hr. Value Rs. 10,000.00
Amin's value Rs. 25,000.00

**M. Subrahmanyam Reddy**
Advocate
8/339, Gandhi Road, Chittoor

## జనవాణి

3 పేజీ తరువాయి

అసెంబ్లీ నియోజక వర్గాలు ప్రత్యేకంగా వారికి కేటాయించారు. పది సంవత్సరాల పాటు ఈ రిజర్వేషన్లు కొన సాగుతాయని అప్పుడు చెప్పారు. నేటికి వాటిని కొనసాగించడం అన్యాయం. ఆనాడు జనాభా ప్రాతిపదికన వాటిని కేటాయించారు. ప్రస్తుతం నెల్లూరు స్థానాన్ని రిజర్వు చేసిన కులాల వారి కంటే ఇతరులు ఎక్కువగా వున్నారు. ఈ రిజర్వేషన్ విధానాలను ఇంకా కొనసాగించడం మంచిది కాదు. ఈ విషయమై అన్ని పార్టీల నాయకులు, మేధావులు ఒకసారి ఆలోచించమని మనవి.

నెల్లూరు -ఎస్. విజయలక్ష్మి

### మునిసిపల్ కొళాయిల్లో మురికి నీరు!

టౌనులో మునిసిపల్ కొళాయిల్లో 8,9 తేదుల్లో మురికి నీరు వచ్చింది. టౌనులోని చిన్నబజారు, జండా వీధి, పెద్ద బజారు మొదలు వేదాయ పాళెం వరకు ఇదే రకం నీరు మునిసిపల్ అధికారులు సరఫరా చేసారు. ముందుగా ఎటువంటి ప్రకటనను మునిసిపల్ అధికారులు జారీచేయక పోవడం వల్ల ప్రజలు తెలియక పలు చోట్ల ఈ మురికి నీటిని పట్టుకొన్నారు. గత వారం వరకు అతిసార వ్యాధితో టౌనులోని ప్రజలు అల్లాడి పోయారు. దీనివల్ల సరఫరా చేసే నీటిని క్లోరినేషన్ చేసి పంపిస్తున్నట్లు అధికారులు ఘనంగా ప్రకటన లిచ్చారు. కాని ఎవరికి మురికి నీరు సరఫరా చేస్తూ ప్రజల ఆరోగ్యాలతో ఆట లాడుతున్నారు.

మునిసి పాలిటీలోని ఇంజనీరింగ్ శాఖ, ప్రజారోగ్య శాఖ నిద్ర పోతున్నట్లుంది. ఛైర్మన్ గారూ పరిస్థితిని చక్కదిద్దండి.

నెల్లూరు -పి. విజయమ్మ

### విద్యుత్ కోతలో క్రికెట్‌కు మినహాయింపు

అధికారులు ప్రకటించిన సమయాన్ని మించి విద్యుత్ కోతను విధిస్తున్నారు. ఈ కోత వల్ల పరీక్షల సమయంలో విద్యార్థులు అల్లాడి పోతున్నారు. పై నుంచి వచ్చిన ఆదేశాలంటూ విద్యార్థులు చదువు కొనసాగించే వేకువ జాము సమయంలో ఎటువంటి మినహాయింపులు ఇవ్వడంలేదు. కాని క్రికెట్ టివిల్లో ప్రసారం అయ్యే సమయాల్లో మాత్రం విద్యుత్ కోతను మినహాయి స్తున్నారు. ఈ ప్రత్యేక ఏర్పాటు ఏమిటో అర్థం కాదు. విద్యార్థులను చదువు పట్ల లేని శ్రద్ధ క్రికెట్ పట్ల ఎందుకు చూపు తున్నారో అర్థం కావడం లేదు.

నెల్లూరు -పి. ప్రవీణ్

### చంద్రబాబుకు సాటిరారు

ప్రస్తుత ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు విద్యార్థి దశ నుండీ తన సమర్థతను రుజావు చేసుకొంటూనే వున్నాడు. యుక్త వయస్సు లోనికి రాక మునుపే ప్రభుత్వంలో మంత్రి పదవి నిర్వహించారు. ఎమ్మెల్యేగా ఒకసారి ఓటమిని చవి చూసి కష్ట సుఖాలు అనుభవించా రాయన. తెలుగు దేశం అధి నాయకుడు ఎన్టీఆర్ జనాకర్షణలో పార్టీని నడపగా, తాను మాత్రం దీక్షా దక్షతులతో ప్రభుత్వాన్ని కొనసాగిస్తున్నారు. వెన్ను పోటంటూ ప్రత్యర్థులు ఎంతగా అరిచి గీపెట్టినా, తనను తాను సమర్థించు కొన్న చాణుక్యుడు. చతురతతో బావ మరుదులను ముందు శ్రేణిలో నిలిపి సర్కారును నడుపుతున్నాడు. ఏడు నెలల స్వల్ప వ్యవధిలో ఒక ముఖ్య మంత్రిగా చేయగల్గిన వన్నీ చేసారు. ఈ విషయాలన్నీ పరిగణలోనికి తీసుకొని ఓటర్లు ఓటేస్తారని నమ్మకం.

లేబూరు -ఎం. అశోకవర్ధనరెడ్డి

## మాగుంట

4 పేజీ తరువాయి

మన్నారాయన. దాని అర్థం విప్పి చెప్పలేదు గాని - అర్థమయ్యేట్లు మాట్లాడారు. గత శాసన సభ ఎన్నికల్లో తనకు ఆనం వారు వెన్నుపోటు పొడిచారని; దాన్ని క్షమించి తాను తర్వాత జరిగిన మునిసిపల్ ఎన్నికల్లో ఆనం వివేకానంద రెడ్డిని ఛైర్మన్ చేసినా - తమ వర్గం కౌన్సిలర్లను చిన్న చూపు చూస్తున్నారని ఆరోపించారు శ్రీ ప్రసన్న రెడ్డి. ఈ భావ సారం, ఈ ప్రసంగ సారాంశం అంతరాత్మ ప్రబోధానికి ప్రేరణ కావాలన్నది ఆయన వుద్దేశ్యమేమో తెలియదు.

ఈ సభలో మాదాల జానకి రాం, పత్తి రవీంద్ర బాబు, సి. ప్రవీణ్ కుమార్ రెడ్డి, కోటంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, ఎనిమిది మంది కౌన్సిలర్లు, ఎన్ఎస్‌యుఐ, సేవాదళ్, మహిళా విభాగాల నాయకులు పాల్గొన్నారు.

ఎట్లయితేనేమి, కాంగ్రెస్ కార్ల క్రింద తమ ఇంట్లో నిప్పుల కుంపటి వెలిగించారు మాగుంట కుటుంబీకులు. ఎన్నికల సమయంలో ఇటువంటి సంకుచిత తత్వాలు, ధోరణులు పార్టీ పట్ల నిబద్ధత కల్గిన వారు వ్యక్తీకరించదగినవి కావు. చేసిన తప్పే మళ్లీ మళ్లీ చేస్తున్నారు వారు!

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

### కోరా - మల్లు

బ్రాహ్మణ వితంతువులకే గాక యితర వితంతువులకు గూడా సరుకు రాగానే ముందుగా రిజిస్టరు చేసి పెట్టుకొని కోరాను సప్లయి చేయ వలసినదిగా సెక్రటరియేటు డిపార్టు మెంటు వారు తెలుపు చున్నారు.

వకీళ్లకు, ధన వంతులకు యేర్పాట్లు జేశారే గాని పేద ప్రాణికి ఒక్కరికి గూడ చాక గుడ్డ దొరకక అల్లాడి పోతున్నారు.

### ఇండ్ల దహనం

రాపూరు తాలూకా గ్రిద్దలూరో 4 తేదీ 123 యిండ్లు దహనం. 30 వేలు నష్టమట.

కనిగిరి తాలూకా వంగపాడు యిగువ పల్లిలో 5 తేదీ 15 యిండ్లు దహన మైనవని ధాన్యం పశువులు 4 వేలు దాకా నష్టమని తెలుపు తున్నారు. కరువుకు తోడు అధిక మాస మన్నట్లు, క్షామానికి తోడు యీ దహన బాధలు గూడానా?

### సుదర్శనమ్మ మహిళా సభ

ఈ క్లబ్బు వార్షికోత్సవం 13, 14 తేదుల్లో లేడీస్ క్లబ్బులోనే జరుగును. 13 తేది సాయంత్రం మహిళల వినోద ప్రదర్శనాలు నాటకము, నృత్యము జరుగును. స్త్రీలు దీనికి రావలెనని.

14 తేది సాయంత్రం జరుగు వస్తు ప్రదర్శనం, క్లబ్బు సభ్యురాండ్రచే తయారు చేయబడిన వస్తు విక్రయమునకు అందరూ రావలెనని అధ్యక్షురాలు రాజం రామస్వామి సతి గారు కోరు చున్నారు.

### రేషనింగు యిబ్బందులు

కొత్త కార్డుల కోసరం రేషనింగు ఆఫీసు ముందు కొన్ని వేల జనం తొక్కిళ్లు, తోపిళ్లు పడ్డారు. ఈ ఆఫీసు రెండు చేతులతో పని జేసినా వాళ్ల చేత కావడం లేదు. రెండేసి మూడేసి రోజులు అన్నం లేక అల్లాడిన పేద జనాన్ని మేము చూచాము. యీ బాధ తగ్గించాలంటె రెండో ఆఫీసు పెట్టడంగాని, యింకింత సిబ్బందిని యెక్కించడం గాని జరిగితేనే గాని యీ అలజడి తగ్గదు.

## పంచాంగం

### సూర్య గ్రహణం

17 తేది బుధవారం పాక్షిక సూర్య గ్రహణం, మన దేశంలో కన్పించదు.

### తమిళ నూతన సంవత్సరం

13 తేది శనివారం సూర్యుని మేషరాశి ప్రవేశము తమిళ సంవత్సరాది

### ఏప్రెల్ తిథులు

చైత్ర బహుళ

తే 13 శని దశమి ప.గ. 11.42 వ

తే 14 ఆది ఏకాదశి ఉ.గ. 9.32 వ

తే 15 సోమ ద్వాదశి ఉ.గ. 7.30 వ

తదుపరి పూర్తి త్రయోదశి

తే 16 మంగళ చతుర్దశి రా.గ. 4.30 వ

తే 17 బుధ అమావాస్య రా.గ. 3.48 వ

చైత్రశుద్ధ

తే 18 గురు పాడ్యమి రా.గ. 3.26 వ

తే 19 శుక్ర విదియ రా.గ. 3.43 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.


శ్రీ మల్లికార్జునస్వామి కామాక్షితాయి
దేవస్థానము - జన్నవాడ క్షేత్రము

టెండరు నోటీసు

నెల్లూరు జిల్లా బుచ్చిరెడ్డి పాళెం (మండలం) జన్నవాడ క్షేత్రమున వెంచేసియున్న శ్రీ మల్లికార్జున స్వామి కామాక్షి తాయి దేవస్థానమున 8.5.96 తేది నుండి 18.5.96 తేది వరకు జరుగనున్న బ్రహ్మోత్సవములలో ఈ క్రింద ఉదహరించిన పనులకు టెండర్లు పిలవబడమైనది.

1. వెల్లవేయుట (సున్నము కొట్టుట); 2. డ్రామా స్టేజి వద్ద బనరేటరు, మైకొసెట్ ఏర్పాటు; 3. డ్రామాలకు స్టేజి కట్టుట; 4. విద్యుత్ దీపాలంకరణ; 5. గ్యాస్‌లైట్లు సప్లయి చేయుట; 6. తెప్ప కట్టుట; 7.బాణా సంచా; 8. షామియానా పందిరి; 9. క్యాంటిన్‌కు సామానులు సరఫరా చేయుట; 10. పాత్ర సామానులు; 11. పడవ రేవు వద్ద చౌక కొయ్యలతో బ్యారికేడ్స్ కట్టుట.

ప్రతి టెండరు దారు రు. 500/- లు ధరావత్తు చెల్లించి దేవస్థానము రశీదుతో పాటు వారి వద్ద టెండర్లు ఒక్కొక్క పనికి విడివిడిగా ఏప్రెల్ నెల 18 వ తేది సాయంకాలం 3 గంటల లోపల దేవస్థానము కార్యనిర్వహణాధికారి వారికి దాఖలా చేయవలయును. టెండర్లు అదే రోజు 18.4.96 తేది సాయంత్రం 5.00 గంటలకు హాజరైన టెండరుదార్లు లేక వారి ఏజెంట్లు సమక్షమున తెరువబడి, తక్కువ టెండరు దారు పేరు ప్రకటించ బడును.

టెండరు తాలూకా పనుల వివరములకు సంబంధించిన షరతులు వగైరా దేవస్థానము కార్యాలయం పనిచేయు వేళలలో సంప్రదించి పొందగలరు.

కె. పాపయ్య, అసిస్టెంట్ కమిషనర్
- ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్



ఉత్తరక్రియలు

మా తల్లి
ఓజిలి గానమ్మ గారు
అల్లూరు

2.4.96 తేది స్వర్గస్తులైనారు. వారికి దైవ సన్నిధిలో చిరశాంతి కలగాలని ప్రార్థిస్తూ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

వారి ఉత్తరక్రియలు 20.4.96 తేది శనివారం అల్లూరుపేట, అల్లూరు మండలములోని మా స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.

కొడుకు - ఓజిలి నరసారెడ్డి కూతురు - ఆదాల వెంకమ్మ
మనుమలు - ఓజిలి రాఘవరెడ్డి, ఓజిలి రమేషురెడ్డి
మనుమరాళ్ళు - ఓజిలి కవిత, ఓజిలి సుచిత్ర
మునిమనుమలు - మనుమరాళ్ళు : హేమంత్, రమ్య సుగుణ, రూపిక

# అన్నపూర్ణాలో అరవై లక్షలతో అద్భుత సెట్టింగ్

తెలుగు సినిమాల వ్యయం విపరీతంగా పెరిగి పోతున్నదని, అదే పరిశ్రమను క్రుంగ దీస్తున్నదని కొందరు వాపోతున్నారు. కాని మరి కొందరు నిర్మాతలు మాత్రం డబ్బును లెక్క చేయకుండా ఖర్చు పెడుతూనే వున్నారు. యువ దర్శకుడు కృష్ణ వంశీ దర్శకత్వంలో అక్కినేని నాగార్జున హీరోగా అన్నపూర్ణా స్టూడియో వారు 'నిన్నే పెళ్లాడుతా' చిత్రాన్ని తీస్తున్నారు. ఈ చిత్రం కోసం అన్నపూర్ణా స్టూడియోలోనే స్టిల్ సెట్, హౌసింగ్ కాంప్లెక్స్, అపార్ట్ మెంట్ సెట్టుల నిర్మాణం కోసం 60 లక్షలు ఖర్చు పెడుతున్నట్లు నిర్మాత వెంకట్ అక్కినేని చెప్పారు. సెట్‌కే ఇంత ఖర్చయితే చిత్రం పూర్తి అయ్యేసరికి ఇంకెంత ఖర్చవుతుందో?

## మోహన్‌బాబు సరసన రోజా

మోహన్ బాబు, రోజాను హీరో, హీరోయిన్లు చేసి గతంలో ఏ ఒక్కరూ చిత్రాన్ని నిర్మించ లేదు. మోహన్ బాబే ఇప్పుడా కొరత తీస్తున్నారు. పెదరాయుడు హిట్ తర్వాత లక్ష్మీప్రసన్న పిక్చర్ పతాకం పై మోహన్ బాబు నిర్మిస్తున్న చిత్రంలో రోజా హీరోయిన్; దర్శకుడు బి. గోపాల్.

## రాఘవేంద్ర రావు చిత్రంలో జెడి చక్రవర్తి హీరో

గులాబి, అనగనగా ఒక రోజు వంటి చిత్రాలలో హీరోగా నటించిన జెడి చక్రవర్తి ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొన్నారు. బిగ్‌స్టార్స్‌తో సినిమాలు తీసి అలసి సొలసి దర్శకులు ఈ మధ్య వర్తమాన హీరోల చిత్రాలు తీసి వాటిని హిట్స్ చేస్తున్నారు. పెళ్లిసందడితో ఘన విజయం సాధించిన రాఘవేంద్ర రావు, జెడి చక్రవర్తి, రంభ జంటగా ఒక చిత్రాన్ని తీస్తున్నారు. ఆయన సోదరుడు కృష్ణమోహన్ రావు దీని నిర్మాత.

## రామానాయుడు ఫోటో గ్యాలరీ!

సురేష్ ప్రొడక్షన్ అధినేత డి. రామా నాయుడు వెరైటీ కోసం ఏదో ఒక పని చేస్తుంటారు. తమ సంస్థలో మొదటి నుంచీ ఇంత వరకు నటించిన హీరో, హీరోయిన్ల వర్ణ చిత్రాలను, సంగీతాన్ని సమకూర్చిన సంగీత దర్శకులు, పాటలు

కొరవ 11 పేజీలో

హలో గురూలో సుహాసిని

# ఎమ్మెస్‌రెడ్డి రామాయణంలో మూడువేల మంది పిల్ల నటులు!

శబ్దాలయ థియేటర్ పతాకం పై ప్రముఖ నిర్మాత ఎం.ఎస్. రెడ్డి నిర్మిస్తున్న రామాయణం చిత్రం కోసం వేలాది మంది బాల బాలికలు షూటింగ్‌లో పాల్గొన్నారు. శ్రీరాముడు అడవులకు బయలుదేరే సన్నివేశం, అయోధ్య నగర వాసులు వీడ్కోలు పలికే సన్నివేశాలు ఆ రోజు చిత్రీకరించారు. దీని కోసం 3 వేల మంది పిల్లలను వివిధ పాఠశాల నుంచి సేకరించి శిక్షణ యిచ్చి షూటింగ్ చేసారు. చిత్రంలో శబరి రాముడి కోసం వేచి చూసే పాటను లతా మంగేష్కర్ చేత పాడిస్తున్నట్లు ఎం.ఎస్. రెడ్డి చెప్పారు.

## హిందీ చిత్రంలో సుమన్!

ఈ మధ్య తెలుగులో అగ్ర హీరోలైన చిరంజీవి, నాగార్జున, వెంకటేష్ పలు హిందీ చిత్రాల్లో నటించారు. పలువురు హిందీ హీరోయిన్లు తెలుగు చిత్రాలకు వలస వచ్చి ఇక్కడే స్థిరపడి పోయారు. చెప్పుకో తగ్గ హిట్స్‌లేక పోయినా హీరో సుమన్‌కు బుకింగ్స్ తగ్గడం లేదు. తెలుగుతో బాటు హిందీ చిత్రంలోనూ నటించాలన్న కోరిక సుమన్‌లో చాలా రోజులుగా వుంది. ఇప్పుడా ఛాన్స్ తగిలింది. జూలై నుంచి షూటింగ్‌లో పాల్గొంటానని చెప్పారు. ఆగస్టులో సొంతంగా తెలుగులో ఒక సినిమా నటిస్తా నంటున్న సుమన్ ప్రస్తుతానికి రాజకీయాలు తనకు వద్దంటున్నారు.

# తెలుగు ప్రేక్షకులు పట్టుకుంటే వదలరు!

తెలుగు హీరో నాగార్జునకు హిందీలో కూడా మంచి క్రేజ్ వుంది. ఆయన నటించిన శివ, ఖుదాగవా, ద్రోహి, క్రిమినల్ అక్కడ బాగా ఆడాయి. ప్రస్తుతం అంగారే హిందీ చిత్రంలో నటిస్తున్నారాయన. హిందీలో కూడా మంచి ఫాలోయింగ్ వున్నా ఎక్కువ చిత్రాల్లో నటించక పోవడానికి కారణాలు చెబుతూ హిందీ చిత్రాల నిర్మాణానికి చాలా ఎక్కువ సమయం తీసుకొంటుంది. ఫలితంగా నటుల్లో ఆసక్తి చచ్చి పోతుంది. అందుకే హిందీ సినిమాల పట్ల ఇంట్రెస్ట్ చూపడం లేదు. అదే తెలుగులో ఆరు నెలల్లో ఒక సినిమా పూర్తవుతుంది. అదీ గాక హిందీ ప్రేక్షకులకు, తెలుగు ప్రేక్షకులకు మధ్య తేడా చాలా వుంది. తెలుగు ప్రేక్షకులు చపల చిత్తులు కారు. వారు ఒక నటుడిని అంగీకరిస్తే, అభిమానిస్తే ఇక వదలరు. నాకు వరుసగా ఏడెనిమిది ఫ్లాపులు వచ్చినా నేను నిలదొక్కు కోగలిగానంటే అది తెలుగు ప్రేక్షకుల గొప్పతనం. హిందీ ప్రేక్షకులు ఈ రోజు ఎవరిని అందల మెక్కిస్తారో రేపు ఎవరిని క్రిందకు లాగుతారో అర్థం కాదన్నారు నాగార్జున.

## అత్యాచారానికి గురయ్యే అభాగినుల కడగండ్లను కళ్లముందు నిల్పిన మంచి సినిమా

# శ్రీకారం

### చిత్రసమీక్ష

అల్లూరు రమణ

సామాజిక స్పృహ, మహిళాభ్యుదయం, చైతన్యం వంటి ఇతి వృత్తాలతో తెలుగు చిత్రాలు రావడం అరుదై పోయింది. ప్రతి దర్శకుడు కమర్షియల్ చట్ర పరిధిని దాటి, బయటకు వచ్చి కథలను తెర కెక్కించ లేక పోతున్నారు. తెలుగు చిత్రాలు మరీ దిగజారి పోతున్నాయనే విమర్శ లెక్కువైనా, ఆ తప్పును ప్రేక్షకుల పై రుద్ది తప్పించు కొనే దర్శక నిర్మాతలు చిత్ర పరిశ్రమలో ఎక్కువై పోయారు. ఏళ్ల క్రితం మానవ హక్కుల ఉల్లంఘన, వ్యక్తి స్వేచ్ఛ హరింప వంటి చక్కని ఇతి వృత్తాలు జోడించి అంకురం చిత్రాన్ని తీసిన దర్శకుడు సి. ఉమా మహేశ్వర రావు చాలా రోజుల తరువాత మరో సామాజిక సమస్యను తీసుకొని 'శ్రీకారం' చిత్రాన్ని తీసారు. అకస్మాత్తుగా కామాంధుల కర్కశత్వానికి బలైన ఒక మధ్య తరగతి మహిళ అనుభవించే వ్యథా పూరిత జీవితాన్ని ఇందులో ప్రేక్షకుల కనుల ముందు సాక్షాత్కరింప జేశారు. మానభంగం కేసుల విచారణ, మహిళల అభిమాన భంగంగా తయారైన విధానాన్ని సక్కగా ప్రశ్నింప జేశారు. న్యాయ స్థానం గోడలు దాటి న్యాయం బయటకు వచ్చేసరికి బాధితులు పడుతున్న కష్టాలను కళ్లకు కట్టారు. ఆడ పిల్లలకు చిన్ననాటి నుంచి చెప్పే పతివ్రతల కథలు, మహిమలు, పురాణాలు వారిని అశక్తురాళ్లను చేస్తున్నాయని; ఆచారాలతో అన్యాయాన్ని ప్రశ్నింప చేయకుండా; పురుషాహంకారం పై స్త్రీని తలెత్త నీయకుండా పాతాళానికి పాతి పెడుతున్నారని విమర్శించారు. ఆడవాళ్లకూ మనసుంటుంది, మెద డుంటుంది; ఆలోచించ నివ్వండి అంటూ, మహిళలంతా పోరాడి స్వేచ్ఛ సాధించాలని శ్రీకారం చిత్రంలో దర్శకుడు నినదించారు.

శాంతమూర్తి (సత్యనారాయణ) నలుగురు ఆడ పిల్లలు. ప్రజా నాట్య మండలి కళాకారుడు శివ (జగపతి బాబు), చంద్రం (ఆనంద్) అతను ఇంటిలో అద్దె కుంటారు. శాంతమూర్తి పెద్ద కూతురు వసంత (మేఘన) శివను అవమానించినా, అతని నిరుద్యోగి అన్న కారణంగా, తండ్రి మాట ప్రకారం చంద్రాన్ని పెళ్లి చేసుకొంటుంది. ఆదర్శ భావాలు గల శివకు అటువంటి యువతి గీత (హీరా) ఇల్లాల వుతుంది. చంద్రం, వసంత ఒక రోజు రాత్రి షికారుకు స్కూటర్ పై వెళ్లి వస్తుండగా నలుగురు దుండగులు అడ్డుపడి ఆమెను పాశవికంగా అత్యాచారం చేస్తారు. చావు బ్రతుకుల మధ్య వున్న వసంతను శివ హాస్పిటల్‌లో చేరుస్తాడు; ఆమె కోలు కొంటుంది. ఆత్మహత్య విషయం పత్రికల్లో రావడంతో శాంతమూర్తి కుటుంబం తల్లడిల్లి పోతుంది. వసంతకు అండగా నిలబడాల్సిన భర్త చంద్రం అవమాన మంటూ వేరే చోటికి వెళ్లి పోతాడు. తల్లి తండ్రులూ ఊరు విడిచి వెళ్తారు. ఆ సమయంలో శివ, గీత దంపతులు

కొరవ 11 పేజీలో

PHILIPS
PHILIPS ఫిలిప్స్
కలర్, B/W టి.వి.లు
రేడియోలు, స్టీరియోలు,
షేవర్లు, వ్యాక్యూమ్ క్లీనర్‌లు,
మిక్సీలు, ఐరన్‌లు, కుక్కర్‌లు
ఆథరైజ్డ్ డీలర్లు ఫోన్:23446
S.S. పాయింట్
రమాకాంత్ బార్ ఎదురుగా, ట్రంకురోడ్డు, నెల్లూరు.
Let's make things better.

## రాయి-తురాయి

* చంద్రబాబు అభ్యర్థులందరూ పేదలేనట
* సుతులు, సతులు సెభాసు, పితాపతులు అభాసు

"రంకు నేర్చినమ్మ బొంకు నేర్వదా?" అని లోకోక్తి. అనుభవ మార్గంలో పండినవి కాబట్టి - లోకోక్తులన్నీ నిజాలే; అన్ని కాలాల్లోనూ అక్కరకు వచ్చేవే. వాటిల్లో లాజిక్ - తర్కం ఉంటుంది. అంతా గట్టి గింజే. రంకు బొంకులనే జంట పదాలు జోడు గుర్రాల వంటివి. మొదటిది ఉన్న చోట రెండోది సిద్ధం.

అయితే - పై సామెత పుట్టిన రోజుల్లో రాజకీయం ఇంత రొచ్చుగా రోతగా లేదేమో? ఇంత బహిరంగ బజారు సరుకు కాలేదేమో? అందువల్ల రంకు బొంకులే జోడు కట్టాయి. ఇప్పుడు మనం వీటికి రాజకీయాన్ని జోడు చేసి "రంకు బొంకులే రాజకీయాలు" అని నిరాక్షేపణీయంగా మార్చుకోవచ్చు.

### అగ్నిమిత్ర

అబద్ధం ఆడ కూడదు; ఒకవేళ ఆడితే గోడ కట్టి నట్లుండాలి - అంటారు పెద్దలు. అది తడిక అల్లినట్లుండ కూడదు; కంతల వల్ల కల్ల తనువు డొల్ల బయట పడి పోతుంది. పరువు మర్యాదలు వీధిన పడతాయి.

పరువు మర్యాదలకు రాజకీయ వాదులకు పరస్పరం చుక్కెదురు; వారికి ఎగ్గు సిగ్గులు అసలుండవు. మేము ఊదింది నాదం; వాగింది వేదం - అని వాళ్ల ఉద్దేశం. ప్రజలు వాళ్ల పలుకుల రాశికంతా తలలూపి "ఊఁ ఊఁ" అనవలసిందని వాళ్ల నమ్మకం.

ఈ ఎన్నికలు ధన బలానికి జన బలానికి మధ్య పోరాటమని ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు గారు నొక్కి మర్లి నొక్కి చెప్పిన మాట. ఎంత లజ్జలేని తనం?

ప్రజాస్వామ్యం ఒక మేడిపండు; పై తళుకు ముద్దు లొలుకుతూ వుంటుంది; పొట్ట పగల గొట్టి చూస్తే - పుట్టలు పుట్టలుగా పురుగులు. చంద్రబాబు మాటలు ఈ మేడిపండు కంటె హీనం.

ప్రజాస్వామ్యం అనే వ్యవస్థలో రూక బలం మూక బలం లేని వాడు ఎన్నికల్లో నిలబడి, నెగ్గడం కల్ల. ఇది జగద్విదితం; ఇంతటి బహిరంగ సత్యాన్నే కాదని, తనది జన బలం, ఇతరులది ధన బలం అనడం సిగ్గు చేటయిన విషయం - జనాన్ని ఏమార్చే కుచ్చితం.

పూసపాటి ఆనంద గజపతి మహా రాజులుంగారు, మేకపాటి రాజమోహన్ రెడ్డి గారు నిన్న మొన్నటి దాకా కాంగ్రెస్ వాదులు. "నరసింహ మమదేహి కరావలంబం" అనుకొంటూ హస్తం కోసం అర్రులు చాచిన వాళ్లు; అది అందక అలక పాన్పు యెక్కిన వాళ్లు; ఎదుర్కోళ్లు చెప్పడానికి ఎదురు

కొరవ 11 పేజీలో

# హరికృష్ణను జనం వెలివేసినట్లుండింది సభ!

తెలుగు దేశం పార్టీలో వీర, విక్రమ, ధీర దిగ్గజాన్ని అని తనకు తాను చెప్పుకొనే నందమూరి హరికృష్ణ ప్రచార సభ నెల్లూరులో తుస్సు మన్నది. తెలుగు దేశం, సిపిఎం పార్టీల మధ్య సరైన సమన్వయం, ముందుగా ఒక ప్రణాళిక లేక పోవడం వల్ల [illegible] ఆయన సభ జరిగిన వి.ఆర్. కళాశాల మైదానం జనం లేక వెలవెల పోయింది. మంత్రి రమేష్ రెడ్డి, ఆయన అనుచరులు ప్రతిష్టాకరంగా నిర్వహించాలను కున్నప్పటికీ ఎందువల్లో బహిరంగ సభలో జనం పలుచగానే కనిపించారు. ఇవన్నీ పట్టించు కోకుండా హరికృష్ణ తన ధోరణిలో లక్ష్మీ పార్వతి పై నిప్పులు కురిపిస్తూ మాట్లాడారు. ఆ మహా తల్లి మొదటి భర్త వీరగంధం వెంకట సుబ్బారావుకు వెన్నుపోటు పొడిచి, ఎన్టీఆర్ జీవితంలో ప్రవేశించి, ఆయనకూ అదే పని చేసింది; ప్రస్తుతం రాష్ట్ర ప్రజలకు వెన్నుపోటు పొడవను రెడీగా వుంది; అందువల్ల ప్రజలు జాగ్రత్తగా వుండాలని హెచ్చరించా రాయన. ఎన్టీఆర్ రాజకీయాల్లో వున్నప్పుడు ఆయన బిడ్డలమైన మేము ఎప్పుడైనా రాజకీయాల్లోకి వచ్చామా, పత్రికలకు ఎక్కామా? నిజమైన కార్యకర్తలను ఈ దుష్టశక్తి లక్ష్మిపార్వతి వెళ్ల గొడుతుంటే కాంగ్రెస్ వాదులు మా ఇంట్లో చేరుతుంటే సహించలేక కార్యకర్తల రక్షణ కోసం రాజకీయాల్లోకి వచ్చామన్నారాయన. ఆమె 1993 ఏప్రిల్ 19 తేది ఎన్టీఆర్ చెంత చేరింది. 20 తేది నుంచే ఎన్టీఆర్ ఆరోగ్యం క్షీణించనారంభించింది. ఆమె కాంగ్రెస్ ఏజెంట్ కాకుంటే ఎన్టీఆర్ మరణ వార్త విజయ భాస్కర రెడ్డికి ఎందుకు ముందు చెప్పింది? ఇంట్లో వున్న మా సోదరుడికి ఎందుకు చెప్పలేదని ప్రశ్నించా రాయన. రాష్ట్రానికి దాపురించిన దుష్టశక్తిని, ఆమెకు అండగా వున్న కాంగ్రెస్‌ను తరిమికొట్టి మిత్రపక్షాల అభ్యర్థి టిపి భానురాజును గెలిపించమని కోరారు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శి కొరటాల సత్యనారాయణ, మార్కెటింగ్ మంత్రి టి. రమేష్ రెడ్డి, రాజ్యసభ సభ్యుడు యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఎమ్మెల్యేలు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి, కంభం విజయ రామిరెడ్డి, ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి వేదిక పై ఆసీనులయ్యారు. సిపిఎం శాసన సభ్యుడు జక్కా వెంకయ్య అధ్యక్షత వహించారు. సభకు తరలించిన కాసింత మంది జనం కూడా చక్కని విషయాలు చెబుతున్న సిపిఎం రాష్ట్ర కార్యదర్శి కొరటాల సత్యనారాయణ ప్రసంగానికి అడ్డు తగిలారు. దానితో ఆయన మిన్నకుండి పోయారు.

### సిపిఎం వుండీ ఎందుకో వైఫల్యం

# 12 లక్షల బ్యాలెట్ పత్రాలు

జిల్లాలోని నెల్లూరు, ఒంగోలు, తిరుపతి పార్లమెంటు నియోజక వర్గ ఎన్నికలకు 10,780 మంది పోలింగ్ సిబ్బందిని నియమించినట్లు జిల్లా కలెక్టర్ డి. సాంబశివ రావు చెప్పారు. సిబ్బందికి 15, 16 తేదుల్లో మొదటి విడత శిక్షణ, 21, 22 తేదుల్లో రెండవ విడత శిక్షణ ఇచ్చేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు. కావలి, నెల్లూరు, గూడూరు, సూళ్లూరు పేట, ఉదయగిరి, వెంకటగిరి, రాపూరు, ఆత్మకూరు కేంద్రాల్లో శిక్షణ నిస్తారు. నెల్లూరు పార్లమెంటు ఎన్నికలకు 12 లక్షల బ్యాలెట్ పత్రాలు ప్రచురిస్తున్నట్లు కలెక్టర్ వివరించారు. ప్రభుత్వ వుద్యోగులు రాజకీయ ప్రచారంలో పాల్గొన కూడదని. ఎన్నికల ప్రచారంలో భాగంగా రాజకీయ పార్టీలు ఏ ప్రదేశంలోనైనా వాల్ పెయింటింగ్‌లు వేస్తే, వాటి ఖర్చును లెక్కగట్టి అభ్యర్థి ఎన్నికల వ్యయంలో జమ చేస్తా మంటున్నారు కలెక్టర్ గారు.

### లక్ష్మి నెల్లూరు జిల్లా వాసే

నెల్లూరు పార్లమెంట్ స్థానానికి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న పనబాక లక్ష్మి ఈ జిల్లాకు చెందిన వ్యక్తేనని, ఆమె నెల్లూరు జిల్లా కోడలని మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి స్పష్టం చేశారు. 9 తేది నెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ పార్టీ అభ్యర్థిత్వాల పై కొంత గొడవ రేగడం ఎన్నికలప్పుడు సహజమే నన్నారాయన. నెల్లూరు నుంచి లక్ష్మి ఘన విజయం సాధించి తీరుతుందని జోస్యం చెప్పారు. లోక్‌సభ ఎన్నికల్లో స్థానికులు, స్థానికేతరులు అనే భావం ఎప్పుడూ రాకూడదంటూ, గతంలో అనంత పురం జిల్లాకు చెందిన అంజనప్ప మూడు సార్లు నెల్లూరు నుంచి ఎన్నికైన విషయం గుర్తుకు తెచ్చారు. రామ్‌టెక్ నుంచి ప్రధాని పివి నరసింహ రావు, మెదక్, చిక్ మగళూరు నుంచి ఇందిరా గాంధీ ప్రాతినిధ్యం వహించిన సందర్భాలను ఉదహరించారు. టిక్కెట్టు కోసం డిసిసికి లక్ష్మి దరఖాస్తు ఆలస్యంగా అందినందు వల్ల ఆ జాబితాలో ఆమె పేరు చేర్చలేక పోయినట్లు జనార్ధన రెడ్డి ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు.

### రాజకీయ పార్టీలకు కలెక్టర్ సూచనలు!

ఒక పార్టీ సభకు మరో రాజకీయ పార్టీ వారు అంత రాయం కల్గించి శాంతి భద్రతల సమస్య సృష్టించ కూడదని జిల్లా కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు హితవు చెప్పారు. 7 తేది కలెక్టర్ ఛాంబర్‌లో విలేకరులతో మాట్లాడుతూ ఓటర్లకు అభ్యర్థులు ఓటెయ్యమని వెళ్లే సమయంలో ఇచ్చే కాగితాల్లో సీరియల్ నెంబరు, బూతు నెంబరు, ఓటరు పేరు మినహా మరో విషయం వుండరాదని; ఇచ్చే స్లిప్ కూడా తెలుపు రంగులో వుండాలన్నారు. అభ్యర్థులు పంచుకొనే డమ్మీ బ్యాలెట్ పత్రాలు తెలుపు, పింకు రంగుల్లో ఓటర్లకు పంచ కూడదని, వాటిలో అభ్యర్థి పేరు, గుర్తు మినహా ఇతర వివరాలు వుండ కూడదన్నారు. అభ్యర్థులు ప్రైవేటు, ప్రభుత్వ యజమాన్యాన్ని సంప్రదించిన మీదటే గోడలపై వ్రాతలు, వాల్‌పోస్టర్లు అతికించా లన్నారు. దీనికి విరుద్ధంగా జరిగితే బాధితులు స్థానిక పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేయవచ్చుని కలెక్టర్ సూచించారు.

### నెల్లూరు సంగతులు

### వాగ్దానాల వర్షం కురిపించిన లక్ష్మి!

నెల్లూరు లోకసభ స్థానానికి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న

కొరవ 11 పేజీలో

### శ్రీ కృష్ణుడు మానవుడిగా ఈ లోకంలో బ్రతికినట్లు ఆధారాలున్నాయా?

# భారతంలో చారిత్రకాంశాలు

ఇది పరిశోధన గ్రంథం. రచయిత పాయసం సుబ్రహ్మణ్యం ఎంతో శ్రమించి, భారతంలో చారిత్రక అంశాలు రచించారు. గత చరిత్రను వెలికి తీయడం, వెలికి తీసిన చరిత్రలోని అస్తవ్యస్త పరిస్థితులను తొలగించి సరైన చరిత్రను నేటి తరానికి, తర్వాతి తరాలకు అందించడం చరిత్ర పరిశోధనల పరమార్థం. చరిత్ర గత మానవ జీవితాన్ని ప్రతిబింబిస్తుంది. పూర్వీకుల విజయాలు, అపజయాలు తెలుసు కొనుటకు చరిత్ర ఉపకరిస్తుంది. చరిత్ర అనుభవాల గ్రంథమని చెప్పవచ్చు. చారిత్రక పరిశోధన వల్ల ఎన్నో విషయాలు తెలుసు కోవచ్చు.

మనం మన వంశకర్తలను, మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులను, ఎందుకు గౌరవిస్తున్నామో మన పూర్వుల చరిత్ర అయిన రామాయణ, మహాభారతాలను కూడా గౌరవించాలని, తెలుసు కోవాలని రచయిత అభిప్రాయం. ప్రాచీన భారత పురాస్థలాలలో త్రవ్వకాల వల్ల పురాణ పురుషులుగా చిత్రించ బడిన రాముడూ, సీతా, పాండవులూ, కౌరవులూ, శ్రీకృష్ణుడూ మనలాగే శ్రేష్ఠ పూర్వంలో జీవించారని, రాజ్యాలు పాలించారని పలు ఆధారాల వల్ల నిరూపించడం జరిగింది. ద్వాపర యుగంలోని శ్రీకృష్ణుడు, తర్వాత బుద్ధుడూ మహాత్ముల వల్ల దశావతారాల్లోకి చేరిపోయారు.

ధర్మతత్వజ్ఞులు ధర్మ శాస్త్రమనీ, ఆధ్యాత్మిక విదులు వేదాంత మనియూ, నీతి శాస్త్ర కోవిదులు నీతి శాస్త్రమనీ, కవి పండితులు మహా కావ్యమనీ, లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమనీ, ఇతిహాసికులు ఇతి హాసమనీ, పౌరాణికులు బహు పురాణ సముచ్చయమనీ, ప్రశంసించు చుండగా, వేద వ్యాస మహర్షి విష్ణు సన్నిధుడై విశ్వజనీనముగా మహా భారతాన్ని సంస్కృతంలో రచించాడు. దాన్ని తెలుగున నన్నయ్య, తిక్కన, ఎర్రనలు అను[illegible]వారు.

కేవలం మానవులుగా జన్మించిన రాముడు, కృష్ణుడు చివరకు బుద్ధుడు కూడా వైష్ణవ మేధావులచే విష్ణుమూర్తి అవతారాల్లోకి చేర్చబడినారు. పాండవులు మంచి వారనీ, కౌరవులు చెడ్డవారనీ భారతంలో చిత్రించ బడ్డారు. అయితే మంచి చెడ్డలు ఇరువురిలోనూ వున్నాయి.

మహా భారతం ఆధారంగా అనేక చారిత్రక అంశాలు ఈ గ్రంథంలో పరిశీలించ బడినాయి. రచయిత ఎందరో ప్రముఖుల గ్రంథాలు పరిశీలించి, భారత యుద్ధం జరిగిన కాలాన్ని యుద్ధ వీరుల తెగువను నిశితంగా పరిశీలించి ఈ వ్యాసాన్ని రూపొందించారు. చారిత్ర కాంశాలు తెలియ పరిచారు. యీ రచయిత కృషిని అభినందించక తప్పదు.

కొరవ 11 పేజీలో

**గ్రంథసమీక్ష**
రచయిత
పాయసం సుబ్రహ్మణ్యం
సమీక్షకుడు
సురభి నరశింహం
ప్రతులకు
బిందు పబ్లికేషన్స్
15/102, బృందావనం,
నెల్లూరు - 524 001.
వెల రూ. 35/-



జిల్లా రైల్వే యూజర్స్ అసోసియేషన్ రైల్వేస్టేషన్ ఏర్పాటు చేసిన చలివేంద్రాన్ని ప్రారంభించిన స్టేషన్ మేనేజర్ జి. శ్రీరాములు, అసోసియేషన్ అధ్యక్ష, కార్యదర్శులు ఐ. వెంకటేశ్వర రావు, జె.వి.కె. బాబు.

నెల్లూరు సంగతులు 10 పేజీ కొరవ

వసుబాక లక్ష్మి టౌనులోని విలేకరులతో 8 తేది తొలిసారిగా మాట్లాడారు. ఈ సందర్భంగా జిల్లా ప్రజల పై వాగ్దానాల వర్షం కురిపించా రామె. తనను ఎమ్పీగా ఎన్నుకొంటే నెల్లూరుకు బైపాసు రోడ్డు, కృష్ణపట్నం ఓడరేవు, పోర్టు సిటీ నిర్మాణానికి సత్వర కృషి చేస్తానన్నారు. చిట్టగుంట లోకో షెడ్డును తిరిగి అక్కడికే తెప్పించను పోరాటం చేస్తానన్నారు. ఇఫ్కో ఫ్యాక్టరీకి శంకుస్థాపన చేయిస్తానని, జాతీయ రహదార్ల నిర్మాణానికి ఎక్కువ నిధులు సాధిస్తానని ధీమాగా చెప్పారామె. ప్రజలకు ఎప్పుడూ అందుబాటులో వుండేందుకు నెల్లూరులోనే కాపురం పెడతా నన్నారు. ప్రజలకు ఏ కష్టం కలిగినా కార్డు ముక్క రాస్తే సమస్యలు తీరుస్తానని నమ్మ బలికారు. కాంగ్రెస్‌లోని అన్ని వర్గాల ఆశీర్వాదం తన కుందని చెప్పారు. విలేకరుల సమావేశంలో వసుబాక లక్ష్మి గెలుపు ఖాయమని డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవ రెడ్డి నొక్కి మరీ చెప్పారు. మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి, మాజీ శాసన సభ్యుడు సివి శేషారెడ్డి, దేవకుమార్ రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి తదితరులు సమావేశంలో పాల్గొన్నారు.


18 ఒంగోలు పార్లమెంటరీ నియోజక వర్గ ఇండిపెండెంట్ అభ్యర్థి

సుబ్బరామరాజు గెలుపు నవోదయానికి పిలుపు



గుంటమడుగు సుబ్బరామరాజు
టామ్‌-టామ్ గ్రూప్ పత్రికల అధినేత & ఛీఫ్ ఎడిటర్

పోలింగ్ తేది 27-04-1996

ఎన్నికల గుర్తు: రెండు ఆకులు


## రైల్వే స్టేషన్‌లో చలివేంద్రం

నెల్లూరు జిల్లా రైల్వే యూజర్స్ అసోసి యేషన్ నెల్లూరు రైల్వే స్టేషన్‌లో ఏర్పాటు చేసిన చలివేంద్రాన్ని స్టేషన్ మేనేజర్ శ్రీ టి. శ్రీరాములు ప్రారంభించారు. ఈ సందర్భంగా స్టేషన్‌లో ఒక సభ ఏర్పాటు జేశారు. అసోసి యేషన్ అధ్యక్షుడు ఐ. వెంకటేశ్వర రావు మాట్లాడుతూ నెల్లూరులో రైల్వే డివిజన్ ఆఫీసు ఏర్పాటు చేయాలని, విజయ మహల్ కొత్త బ్రిడ్జి వద్ద అప్రోచ్ రోడ్ల పని త్వరగా పూర్తి చేయాలని కోరారు. కె.కె. ఎక్స్‌ప్రెస్‌ను నెల్లూరులో ఆపాలనే వినతి పత్రాన్ని, కార్యక్రమానికి విచ్చేసిన విజయ వాడ సీనియర్ డివిజన్ కమర్షియల్ మేనేజర్ ఎం. పెంచలయ్యకు సమర్పించారు. కార్యక్రమంలో జె.వి.కె. బాబు, కొండా బలరామి రెడ్డి, కె. హరనాథ్ తదితరులు పాల్గొన్నారు.

## ఏప్రెల్ నెలలో కూడా అదనపు రేషన్!

ఎన్నికలను పురస్క రించుకొని గత నెలలో ప్రజా పంపిణీ వ్యవస్థలో మార్పు లొచ్చాయి. మార్చి నెలలో ఎప్పుడూ ఇవ్వలేనంతగా మూడేసి కిలోలు పామోలిన్ ఇస్తున్నట్లు అధికారులు ప్రకటించారు. ఈ సరకును కొందరు డీలర్లు ఇస్తే, మరి కొందరు ఇవ్వలేదు.

ఏప్రెల్ నెలలోనూ అదనపు రేషన్ ఇస్తామన్నారు జాయింట్ కలెక్టర్ బి.వి.ఎస్. ప్రసాద్; అన్ని రేషన్ కార్డులకూ అదనంగా ఒక ఒక కిలో పంచదార ఇస్తా మంటున్నారు. పట్టణ ప్రాంతాల్లో పింకు కార్డుకు 2 కిలోలు, తెలుపు కార్డుకు కిలో పామోలిన్ ఇస్తారు. గ్రామీణ ప్రాంతాల్లో కేవలం పింకు కార్డుల వారికే పామోలిన్ అందిస్తారు. పట్టణ ప్రాంతంలో కేజీ 6.50 రూపాయల లెక్కన పంపిణీకి టాంం మెట్రిక్ టన్నుల బియ్యం రెడీగా వున్నాయట. చౌక డిపో డీలర్లను దబాయించి మరీ సరుకులు తీసుకో మంటున్నారు జెసి గారు.

## మైథిలి హైస్కూల్ వార్షికోత్సవం

నిప్పో ఫ్యాక్టరీ దగ్గరలో వున్న మైథిలి ఇంగ్లీషు మీడియం హై స్కూల్ వార్షికోత్సవం 6 తేది జరిగింది. ఉపన్యాసకునిగా విచ్చేసిన ప్రాన ప్రవీణ మణి కార్యక్రమాన్ని రక్తి కట్టించారు. అధ్యక్షత వహించిన వాస్తు రామచంద్ర, దర్గామిట్ట హైస్కూల్ మాజీ ప్రధానో పాధ్యాయుడు ఎ. రాధాకృష్ణా రెడ్డిని సత్కరించారు. స్కూల్ నిర్వాహకులు మైథిలి మనోహర్ రెడ్డి స్వాగతం పలికి, చివరన వందనాలు చెప్పారు.

## ఎన్నికల కమీషన్ మెలిక

పార్లమెంటు ఎన్నికల్లో ఫోటో గుర్తింపు కార్డులు లేనప్పటికీ ఓటు హక్కు వినియోగించు కోవచ్చని చెప్పిన ఎన్నికల కమీషన్ ఇప్పుడొక మెలిక పెట్టింది. ఇప్పటికే రెడీగా వున్న గుర్తింపు కార్డుల జాబితాల్ను పోలింగ్ స్టేషన్‌లోని ప్రిసైడింగ్ అధికారుల వద్ద ఇచ్చి పెడతారట. దీనివల్ల దొంగ నోట్లను కొంత మేరకు తగ్గించ వచ్చని ఎన్నికల కమీషన్ భావన. కాని దీనివల్ల పోలింగ్ బూతుల్లో అనవసర రభస జరిగేందుకు కమీషనే అవకాశం కల్పించి నట్లవు తుందేమో?

గ్రంథసమీక్ష 10 పేజీ కొరవ

మహాభారతం ఒక మహారథి. ఆ ఊరధిని తరచి చారిత్రక సత్యాలను వెలికి తీసిన రచయిత పరిశీలనా దృష్టి పాఠకులకు ఆశ్చర్యం కలిస్తుంది. చరిత్ర యెప్పుడూ గత కాలపు సత్యాన్ని తెలుపుతుంది. ఈ సత్యాలు తెలిపే గ్రంథమే మహా భారతంలోని చారిత్రక అంశాలు.

రాయి తురాయి 10 పేజీ కొరవ

తెన్నులు చూస్తున్న చంద్రబాబు తటాలున బెల్ కొట్టి వారి చేత సైకిలు పట్టించేశాడు. ఇది కల్తీలేని రాజకీయ రంకు. వీళ్ల ధనహీను లనడం పెద్ద బొంకు. పొద్దస్తమానం కాంగ్రెస్ పై దుమ్మెత్తి పోస్తూ, అన్ని అరిష్టాలకు కాంగ్రెసే మూలమని పాడిపోస్తూ, ఆ కాంగ్రెసు వాళ్లనే స్వచ్ఛమైన నికారసయిన తన తెలుగు దేశం పార్టీలో ఎందుకు చేర్చుకొన్నట్లు? ఇది చాలదన్నట్లు - తన అభ్యర్థు లందరూ బికారులని తప్పుడు మాటలు చెప్పడ మెందుకు? ఆవాన్ని బిల్లుపుచ్చి జిల్లకొట్ట డానికేనా!

రాజమోహన్ రెడ్డి గారు వందల కోట్ల రోడ్ల కాంట్రాక్టుల కధిపతి; ఇటుకల బదులు నోట్ల కట్టలతో భవంతులు నిర్మించ గల్గిన అపర కుబేరుడు. ఆయన్ను కూటికి లేని పేద అని మనన్ని నమ్మించ జూస్తున్నాడు చంద్రబాబు.

ఇక ఆనంద గజపతి మహా రాజాలుంగారి మాట చెప్ప నవసరం లేదు. ఆయన పేరులోనే ఉంది గజపతుల రాజ వంశ సంపదంతా. వీళ్లంతా సిద్ధాంత నిబద్ధత మీద నిలబడే వాళ్లు కాదు; టిక్కెట్ల మీద నిలబడే వారు. ఇక్కడ తంతే అక్కడ; అక్కడ మెడబెట్టి నూకితే ఇక్కడ. వీళ్లినా ప్రజల సమస్యలను పట్టించుకొని పరిమ రించేది? సినీ నటుడు కైకాల సత్యనారాయణ బాగా అర్థించి కోటీశ్వరుడు. అయినా ..సి చంద్రబాబు టిక్కెట్టిం పర్థిశికెట్టు ఇచ్చేశాడు. కాబట్టి వీళ్లంతా మింగ మెతుకు లేని వాళ్లని మనం నమ్మాలి. ఆ మాట కొస్తే, ఆ తీరులో చూస్తే అసలు చంద్రబాబే గొప్ప నిరుపేద అనుకోవాలి కదా!

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో గోబెల్సు అనే వాడు ఒకరుండే వాడు. వాడు అబద్ధాల పుట్ట. అబద్ధాలు అదే పనిగా పదే పదే చెప్పండి; కాసేపటికి వెర్రి జనం వాటిని నిజమని నమ్మేస్తారు - అని తన బృందానికి ఉపదేశం చేసేవాడు. చంద్రబాబు నాయుడు గారు గోబెల్సుకు అన్నా? తమ్ముడా?

## సుతులు, సతులు, సెభాషు, పితాపతులు అభాసు

నీతి నిజాయితులున్న నక్క హరిశ్చం ద్రులకే కాంగ్రెసు టిక్కెట్లు - అన్నారు. హవాలా హాలాహల నిహతులకు మొండి చెయ్యేకాని దండి చెయ్యి లేదు పొమ్మన్నారు. అరవింద నేతం, కమలనాథ్‌లు హవాలా విప భక్షకులు; వీళ్లకు టిక్కెట్లు నిరాక రించడం జరిగింది ఇంత వరకూ బాగానే ఉంది. కాని "నీ ఎడం చెయ్యి తియ్యి, నా పుర చెయ్యి పెడతాను" అన్నట్లు వాళ్ల సతీమణులకు ముత్తైదు తాంబూలాలు ఇచ్చేశారు.

బలరాం జక్కర్, బూటా సింగ్, జాఫర్ షరీఫ్‌లూ‌ఫ్లూ హవాలా తాడితులే! కాని వాళ్ల సుపుత్రులకు టిక్కెట్ల పందేరం జరిగి పోయింది. తండ్రులకు, భర్తలకు తిరస్కారం - తనయులకు భార్యలకు పురస్కారం.

పి.వి. మహా పండితుడు; మనబోటి సాదా సీదా మనుషులకు ఆయన లాజిక్కు అర్థం కాదు. అందులోని మ్యాజిక్కూ బోధపడదు. కాని ఒక్క ప్రశ్న మాత్రం అడగక తప్పదు. "ఆవు చేలో మేస్తే దూడ గట్టున మేస్తుందా?"

మనకు రాజకీయ వేత్తలు లేరు. అందరూ రాజకీ యోపజీవులే. రాజకీయ రంగాన్ని ఆశ్రయించి, పదవి జేబులో పెట్టుకొని, ఏ ఇబ్బందులూ లేకుండా అడ్డమైన దారుల్లో దూరి దుడ్డు బవురు కొందా మనుకొనే దురాశ పరులే! అందుకే దేశం ఇట్లా తగలడు తూంది.

*రాజకీయం రొచ్చు*

*రంకుబొంకులె మెచ్చు*

*పనిగట్టి పని బట్టు*

*రాజ్యమే నీ తట్టు ఓ కూనలమ్మా*

చిత్రసమీక్ష 9 పేజీ కొరవ

వసంతకు అండగా నిలుస్తారు; కేసు కోర్టులో విచారణ స్థాయికి వస్తుంది. ఐపిసి 376 సెక్షన్‌లోని లొసుగుల వల్ల కోర్టులో లాయర్ల ప్రశ్నలకు వసంత తల్లడిల్లి పోతుంది. అండగా నిలబడిన శివ పలు అవమానాలు భరించాల్సి వస్తుంది. గీత లేక సాక్ష్యం చెప్పను కోర్టుకు వచ్చిన శర్త చంద్రం వసంత వ్యక్తిత్వాన్ని, మనోభావాలను దెబ్బ తీసే విధంగా అవమాన కరంగా మాట్లాడి ఆమెను పాశవికంగా అవమానించే ప్రయత్నం చేసి, ఆమె చేతుల్లో ప్రాణాలు విడుస్తారు. వసంత సమస్య ప్రజాసమస్య అవుతుంది. మహిళా ఉద్యమం బయలు దేరేసరికి, అత్యాచారానికి పాల్పడ్డ దుర్మార్గులు కోర్టుకు లొంగి పోతారు. కొండంత మనో నిబ్బరంతో వసంత బాహ్య ప్రపంచానికి వచ్చి మహిళలకు స్ఫూర్తినిస్తుంది.

అత్యాచారానికి పాల్పడ్డ మహిళ ఆ సంఘటనను వివరించి చెప్పాలని లాయర్లు గుచ్చి గుచ్చి అడుగుతున్న ప్రశ్నలకు కోర్టు అనుమతితో బొమ్మల సహాయంతో బాధితులు చూపించిన సన్నివేశం ప్రేక్షకుల కంట తడి పెట్టిస్తుంది. మధ్య తరగతి కుటుంబంలో అటువంటి సంఘటన జరిగి నప్పుడు ఆ కుటుంబాలు పడే ఆవేదనను చక్కగా చూపించడంలో దర్శకుడు కృతకృత్యుడయ్యాడు. చివరికి బాధితురాలికి ఏమి మిగిలిందన్న ప్రశ్న చిత్రం చూసిన చాలా మందికి రావచ్చు. కాని ధైర్యంగా కోర్టులకు వెళ్లి, సహనంగా పోరాటం చేయకుంటే, నానాటికి అత్యాచార అభాగినుల శాతం రెట్టింపు అవుతుంది. ఏది ఏమైనా పరమ కిరాతక ప్రశ్నలతో మహిళలను తల్లడింప చేసే భారతీయ న్యాయ స్మృతిలోని 376 సెక్షన్‌ను పునః సమీక్షించాలి. చిత్రం ప్రథమార్థంలో నీరసంగా నడిచినా ద్వితీయార్థం ఆసక్తికరంగా సాగుతుంది. కొత్తగా మాటలు వ్రాసిన కె.ఎల్. ప్రసాద్ మాటలు తూటాలే. బాలాంరి, సీతారామ శాస్త్రి వ్రాసిన మనసు కాస్త కలతపడితే, నిత్యం రగులు తున్న అగ్ని పర్వతం పాటలు బాగున్నాయి. ఇళయ రాజా తన స్థాయికి తగిన సంగీతాన్ని ఇవ్వలేక పోయాడు. నటీనటుల్లో మేఘన, జగపతి బాబు నుంచి పూర్తి నటనను దర్శకుడు రాబట్టు కొన్నాడు. సత్య నారాయణ, ఆయేషా జలీల్, హీరా లోటు లేకుండా కనిపించారు. చిత్రానికి కథను సమకూర్చి, స్క్రీన్‌ప్లే చక్కగా నడిపి, దర్శకత్వం నెరిపిన ఉమా మహేశ్వర రావు అభినంద నీయుడు. ఇటువంటి చిత్రాన్ని ప్రేక్షకులు ఆదరిస్తే, మరికొన్ని ఆదర్శ చిత్రాలు వచ్చి, తెలుగు చిత్రాల స్థాయిని నిలబెడతాయి.

సినిమా 9పేజీ కొరవ

పాడిన గాయనీ గాయకుల వర్ణ చిత్రాలను తమ స్టూడియోలో అలంక రించాలని ఆయన నిర్ణయించారు. తమ చిత్రాల్లో నటించిన హీరోయిన్లే 70 మంది వున్నారని రామా నాయుడు చెబుతున్నారు. మరి హీరోలు, ఇతర ఫోటోలతో రామా నాయుడు స్టూడియో కళకళ లాడి పోవడం ఖాయం.

## సౌందర్య కోరిక

తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో నలభై చిత్రాల్లో హీరోయిన్‌గా నటించిన సౌందర్య తన మనసులోని కోరిక ఇటీవల బయట పెట్టింది. ఆమెకు కమల హాసన్ సరసన నటించాలని వుందట. శుభ సంకల్పం ఛాన్స్ మిస్ అయ్యిందట. మళ్లీ ఎప్పుడు ఛాన్స్ వస్తుందోనని ఎదురు చూస్తున్నది.

# A NEW ERA DAWNS...

## ... IN THE ANNALS OF VR COLLEGE'S GLORIOUS HISTORY

**SRI N. JANARDANA REDDY**

FORMER CHIEF MINISTER, GOVT. OF A.P.

*will inagurate*

# V.R. LAW COLLEGE COMPLEX

## (AC SUBBA REDDY BUILDINGS)

**ON SATURDAY, THE 14 APRIL 1996 AT 9.30 A.M.**



*THIS IS A LANDMARK TO THE GLORIOUS HISTORY OF V.R. COLLEGE.*

*THIS WILL CHERISH THE EXEMPLARY EDUCATIONAL IDEALS OF THE PEOPLE OF NELLORE.*

*WE ARE SURE THIS NEW COMPLEX WILL DAWN A NEW ERA.*

**Anam Vivekananda Reddy,** Chairman, V.R. College.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore